# త్రైతారాధన




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org



# త్రైతారాధన


<u>రచయిత :</u> **త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41 నాల్గవ ముద్రణ : జూన్-2019

ప్రతులు : 1000 **వెల : 65/-**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు–అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
05. మాయకుడు–అమాయకుడు.
06. తల్లి తండ్రి–గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం–దేహం మోహం.
11. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
15. మాయ మర్మము– ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం–లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము–మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం– తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం– రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు–కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు–అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని అజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము. 126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు. 130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా।।), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ఆరాధన

ఒక మనిషి తన ఉద్దేశ్యములో విలువైన దానికొరకు విచారించడము లేక ఆరా తీయడము జగతిలో జరిగే విషయమే. విలువైనది ఏదైనా అది ధనముతో సమానమే. విలువైనది ఏదైతే ఉందో, అది ఎక్కడ లభిస్తుందో, ఎవరివద్ద లభిస్తుందో తెలిసి, దానికొరకు కొంత కార్యము లేక కొంత శ్రమ పడవలసియుంటుంది. అటువంటి కార్యమునకు ఒక ప్రత్యేకమైన పేరు గలదు. దానినే **"ఆరాధన"** అంటున్నాము. మనుషులలో ఎన్నో రకములైన ఆరాధనలు గలవు. దేనినైతే ధనముగా భావించి దానికొరకు ఆరాతీయడమును ఆరాధన అంటున్నామని చెప్పుకొన్నాము కదా! ఇపుడు ఒక ఆరాధనను ఉదహరించుకొని చూస్తాము. ఒకడు మరొక మనిషి యొక్క స్నేహమును కావాలనుకొన్నాడు. అపుడు వాని దృష్టిలో ఆ స్నేహము విలువైనది. ఎదుటి మనిషి స్నేహమును కోరిన మనిషి ఆ స్నేహమును సంపాదించుకొనుటకు కొంత ప్రయత్నమును చేయవలసియుండును. ఆ ప్రయత్నము కార్యరూపములో ఉండును. అటువంటి కార్యములో ఎదుటి మనిషి కనిపించినపుడు గౌరవముగా పలకరించడమూ, ఆ మనిషికి ఇష్టమైన పనులు చేయడమూ, ఆ మనిషి స్నేహమునకు అవసరమైనట్లు నడుచు కోవడము మొదలగు కార్యములుండును. అటువంటి కార్యములనే 'స్నేహ ఆరాధన' అంటున్నాము. అదే విధముగా ప్రేమారాధన కలదు. ప్రేమారాధనలో ప్రేమే వానికి విలువైనది. అందువలన ప్రేమ+ఆరాధన= ప్రేమారాధన అంటున్నాము. ఈ సూత్రము ప్రకారము జీతము రూపములో వచ్చు ధనము కొరకు ఉద్యోగము చేయువాడు కూడ ఆరాధన చేసినట్లే. అందువలన కొందరికి వారి వృత్తే వారికి ఆరాధన అంటున్నాము.

భూమి మీద ఒక మనిషి ఒక విలువైన దానికొరకు చేయు ప్రతి కార్యము ఒక ఆరాధన అయితే అటువంటివి ఎన్నో ఆరాధనలు గలవు. దేవతల వద్దనుండి మనిషి విలువైన దానిని కోరి దానికొరకు చేయు

కార్యమును 'దేవతారాధన' అంటున్నాము. జగతిలో ఎన్నో రకములైన దేవతారాధనలు గలవు. ఒక క్షుద్రదేవతను ప్రసన్నము చేసుకొని ఆ దేవత నుండి తాను ఆశించినది పొందవలెనని ఆ దేవతకు ఇష్టమైన జంతువును బలి ఇవ్వడము ఒక కార్యము కాగా, ఆ కార్యమును 'క్షుద్రదేవతారాధన' అంటాము. ఇట్లు క్షుద్రదేవతల ఆరాధనలు ఎన్నో రకములు మరియు మహాదేవతల ఆరాధనలు ఎన్నో రకములు ప్రస్థుత కాలములో కూడా గలవు. అదే విధముగా మనుషులైన, బ్రతికియున్న బాబాలనూ, చనిపోయిన స్వామిజీలను ఆరాధించడము గలదు. ఇంకా చెప్పుకొంటే సంతాన ధనమును ఆశించి పాములనూ, ఆరోగ్యధనమును ఆశించి వృక్షాలనూ ఆరాధన చేయడము గలదు. దేహ బలమును విలువగా భావించిన కుస్తీ పహిల్వాన్‌లు ఆంజనేయున్నీ, దొంగతనము సులభముగా జరుగవలెనని దొంగలు కృష్ణున్నీ, చదువు బాగా రావలెనని సరస్వతిని, శక్తి కావాలని కాళికాదేవినీ, యుక్తి కావాలని విష్ణువునూ, ఎందరో ఎన్నో రకముల ఆరాధనలను చేయుచుందురు. **ఇటువంటి ఆరాధనలన్నిటినీ కలిపి భగవద్గీతలో 'అన్య దేవతారాధన' అని భగవంతుడన్నాడు.**

యోగశాస్త్రమైన భగవద్గీతను ఆధారము చేసుకొని ఆరాధన విషయములను గమనిస్తే అందులో ఆరాధనలు రెండు రకములుగా గలవు. ఒకటి జీవునికి అశాశ్వితమైన ధనమును అందించునవి. రెండు జీవునికి శాశ్వితమైన ధనమును అందించునవి. ప్రకృతివశమైన సుఖములను అందించు ఆరాధనలను గురించి చెప్పుతూ పోతే వందలూ, వేలూ, లక్షలూ గలవు. పరమాత్మవశమైన సుఖమును అందించు ఆరాధనలు కేవలము మూడే గలవు. **వాటినే భగవద్గీతలో ఒకటి బ్రహ్మయోగము, రెండు కర్మయోగము, మూడు భక్తియోగము** అంటాము. ఈ మూడు యోగములను ఆచరించని వారు కూడా మూడు యోగములకు నమూనాగా మూడు

రకముల ఆరాధనలను, మూడు దినములందు, మూడు కాలములలో ఆచరించునట్లు పెద్దలు తెల్పియున్నారు. ఆ మూడు ఆరాధనలనే **'త్రైతారాధన'** అంటున్నాము. ప్రపంచములోని ఆరాధనలన్నీ యోగమునకు సంబంధము లేనివై, భోగముల ధనమును కాంక్షించునవై ఉన్నవి. **కేవలము త్రైతారాధన మాత్రము జ్ఞాన ధనములను అందించి దేవునియందు ఐక్యము చేయగలదు. త్రైతారాధన కాకుండా మిగతా ఆరాధనలన్నీ కర్మలను కలుగజేసి జన్మలకు పంపునవై ఉన్నవి.**

బాగా ఆలోచిస్తే నేటి జనులలో పెద్దగా పేరుగాంచిన స్వామీజీలకే ఆరాధన యొక్క అర్థము, విధానము తెలియకుండా పోయినది. ఇక సాధారణ మనిషిని చూస్తే తానేమి చేయుచున్నాడో తనకే తెలియని స్థితిలో ఉంటూ నేను చేయునదంతా సరియైనదే అనుకొంటున్నాడు. ఇటు సాధారణ మనిషిగానీ, అటు స్వామీజీలుగానీ నాకు అన్నీ తెలుసునను గోడకట్టుకొని ఉండుట వలన వారు ఏమీ గ్రహించుకొను స్థితిలో లేరు. మనుషులలో అరుదుగా కొందరు మాత్రము తనకు తెలియనిది తెలుసుకోవాలనుకొనినా, వారు కూడా దేవతారాధన చేయువారినే ఆశ్రయించి అదే దారిలో పోవడము జరుగుచున్నది. **ఆరాధనలలోనే పెద్దవనుకొనిన యజ్ఞయాగాదులూ, జప తపములూ తనను ఆరాధించునవి కాదని భగవద్గీతలో దేవుడే స్వయముగా చెప్పినప్పటికీ ఆ విషయము తమకు తెలియకుండా పోయినది.** పీఠాధిపతులు, మఠాధిపతులు సహితము బాహ్యాయజ్ఞములను చేయుచు అంతర్ యజ్ఞములను మరచిపోయారు. **భగవద్గీతలో చెప్పిన ద్రవ్యయజ్ఞము, జ్ఞాన యజ్ఞములను** అర్థము చేసుకోలేక పోయారు. ఇటువంటి స్థితిలో సామాన్య మానవున్ని సరియైన మార్గములో నడిపించి, దేవుని సన్నిధానమునకు చేర్చువారే కరువైపోయారు. ఇటువంటి సందర్భములోనే ద్వాపరయుగములో దేవుడు భగవంతునిగా భూమిమీదకు వచ్చి, అన్య దేవతారాధన వదలి తనను మాత్రము ఆరాధించమని భగవద్గీతలో చెప్పాడు. చివరకు యజ్ఞములు,

దానములు, వేదపఠనములు, తపస్సులు కూడా తన ఆరాధనకాదనీ, వాటి వలన నావద్దకు చేరలేరనీ చెప్పిపోయాడు. ఆ విషయము ప్రజలకు తెలిస్తే మాకున్న గౌరవము పోతుందని తలపోసిన కొందరు స్వామీజీలు దేవుడు చెప్పిన దానిని ప్రజలకు తెలియకుండా చేశారు. అందువలన దేవుని జ్ఞానవిషయములో ప్రజలు ఎంతో నష్టపోయినవారైనారని చెప్పవచ్చును.

ఇదంతయూ గ్రహించిన దేవుడు తాను భూమిమీద చెప్పిన ధర్మములు ఎవరికి తెలియకుండా పోయినవని తెలిసి, అధర్మములు అణిగిపోకుండా సజీవముగా ఉన్నవని గ్రహించి, అధర్మములను అణచివేసి ధర్మములను వృద్ధి చేయుటకు పూర్వమున్న జ్ఞాన విషయములను మనకు జ్ఞాపకము చేయదలచుకొన్నాడు. అందువలన ఈ విషయములను ఊహ ద్వారా నాకు అందించి, వ్రాయించి మీకు తెలియజేయుచున్నాడు. అందువలన **'త్రైతారాధన'** అను గ్రంథములో వ్రాయబడియున్న మూడు ఆరాధనలు దేవతారాధనలు కావనీ, దేవుడు గీతలో తెల్పిన మూడు యోగముల సారాంశమే 'త్రైతారాధన' అని తెలియవలెను. త్రైతారాధనను ఆచరించిన వారు మూడు యోగములను ఆచరించినట్లగును. అందువలన దైవ సన్నిధియైన మోక్షమును పొందుటకు మూడు ఆరాధనలు మూడు సోపానములలాంటివని చెప్పవచ్చును. ఈ త్రైతారాధనను చదివి ఆచరించక పోయినా పరవాలేదు, కానీ దీనిని గురించి వ్యతిరేఖముగా మాట్లాడితే అది తప్పక దైవదూషణయగును. ఎవరికీ తెలియకుండా పోయిన త్రైతారాధనను గురించి ఎవరికైనా చెప్పినా, ఈ గ్రంథమును ఎవరికైనా దానము చేసినా అది దేవుని కార్యమును చేసినట్లగును. అది నిజమైన దేవుని సేవయగును.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు, త్రైతసిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

"గగనమ్ శూన్యమ్" అను నానుడి అందరూ వినియేయుందురు. అది కేవలము ఒక నానుడియే కాక నగ్నసత్యము. వివరముగా చెప్పుకొంటే గగనము అనగా ఆకాశము అని అర్థము. ఆకాశము అనగా శూన్యమనియే అర్థము. శూన్యమును దేవునితో సమానముగా, ఏదీ కానిదని ఉపమానముగా చెప్పవచ్చును. శూన్యము లేక ఆకాశము దేవుడుకాకపోయినప్పటికీ దేవునికి దగ్గరగా, దేవునికి సమతగా చెప్పవచ్చును. ఏ స్థూలపదార్థమూ కానటువంటి దేవున్ని, ఏ స్థూలవస్తువుగాని శూన్యముతో పోల్చి చెప్పుటకు అవకాశము గలదు. నేటికినీ చాలామంది దైవమును జ్ఞాపకము చేసుకొన్నపుడు ఆకాశమువైపు చూచి నమస్కరించుచుందురు. క్రికెట్ ఆటగాళ్ళు నూరు రన్నులను చేసినపుడు దేవునికి కృతజ్ఞత చెప్పుకొన్నట్లు ఆకాశమువైపు చూచుట గమనించవచ్చును. అదేవిధముగా కొందరు తమ మాటలలో దేవుడు పైనుండి చూస్తున్నాడని కూడా అనుచుందురు. ఇట్లు అనేకమంది తమ భావములో దేవుడు ఆకాశములో నిండియున్నాడని తలచుచుందురు. దేవుడు కనిపించకుండా అణువణువునా ఆకాశమంతా నిండియుండడము వాస్తవమే. అందువలన **"గగనమ్ శూన్యమ్" అన్నట్లు "శూన్యమ్ దైవమ్"** అనికూడా అనవచ్చును. అంతేకాక దేవుడు పైనుండి చూస్తున్నాడని చాలామంది అనుచుందురు. ఈ మాటలన్నిటినీ బట్టి దేవుడు పైనున్న ఆకాశములో కూడ ఉన్నాడని చెప్పవచ్చును. దేవుడు గాలిలోనూ, అగ్నిలోనూ, నీరులోనూ, భూమిలోనూ అణువణువునా నిండివున్నప్పటికీ, వాటికి ప్రాధాన్యతనివ్వకుండా ఒక్క ఆకాశమునకే ఎందుకంత ప్రాధాన్యత నిచ్చారని యోచిస్తే కొంత వివరము తెలియగలదు. ఆ వివరమేమనగా!

గాలి, అగ్ని, నీరు, భూమిలలో స్వయం ప్రకాశమైనవి ఏవీలేవు. ఎక్కడైనా భూమిలో రత్నములాంటివి చిన్న ప్రకాశముగలవి ఉండినా అవి

సజీవముగా ఉండవు. ఒకేవొక ఆకాశములో మాత్రమే సజీవముగా ఉండి, ప్రకాశముగలవియైయుండి, దేనినైనా గ్రహించు శక్తిగల గ్రహములుగా ఉన్నవి మూడే మూడు గలవు. అవియే ఒకటి సూర్యుడు, రెండు చంద్రుడు, మూడు నక్షత్రము. ఆకాశములోనున్న సూర్య,చంద్ర,నక్షత్రములు మూడు పూర్వకాలమునుండి మనుషులచేత దైవసమానముగా పరిగణింప బడుచున్నవి. భూమి మీద నివశించు ప్రజలు నాగరికతలేని కాలమునుండి సూర్యున్ని కొందరూ, చంద్రున్ని కొందరూ, నక్షత్రమును కొందరూ ఆరాధిస్తూనే ఉన్నారు. మనుషులు సృష్టించుకొన్న విగ్రహారాధన లేని కాలములో కూడా గ్రహములైన సూర్య,చంద్ర,నక్షత్రములను ఆరాధించెడి వారు. కొన్ని దేశములలో సూర్యున్ని ఎక్కువ ఆరాధించెడివారు, మరికొన్ని దేశములలో చంద్రున్ని ఎక్కువ ఆరాధించెడివారు. కొన్ని దేశములు ప్రత్యేకించి నక్షత్రమునే ఎక్కువ ఆరాధించెడివారు. ఇంకా కొన్ని దేశములలో చంద్రున్ని నక్షత్రమును ఆరాధించగా, ఇంకా కొన్ని దేశములలో సూర్యచంద్రులనూ, మరికొన్ని దేశములలో మూడు గ్రహములనూ ఆరాధించెడివారు. ఇప్పటికీ ఆయాదేశములలో వారి దేశ జెండాలమీద వారు ఆరాధించెడి గ్రహముల బొమ్మలను గుర్తుగా పెట్టుకొని గౌరవప్రదముగా చూచుకొనుచున్నారు. నేటికినీ అమెరికా జెండాలలో నక్షత్రములనూ, పాకిస్థాన్ జెండాలో చంద్రున్ని, నక్షత్రమునూ అందరూ గమనించియేయుందురు. లెక్కించి చూచితే 73 దేశాలు తమ జెండాల మీద సూర్యుడినో, చంద్రున్నో, నక్షత్రములనో ముద్రించుకొన్నాయి. అర్జెంటీనా మొదలగు 13 దేశములు సూర్యుని జెండాను పెట్టుకోగా, మాల్దీవులు చంద్రుని జెండాను పెట్టుకోగా, క్యూబా, చైనా, అమెరికా మొదలగు 59 దేశములు నక్షత్రమును జెండాలో పెట్టుకొన్నవి.


Argentina
**సూర్యుడు-అర్జెంటీనా**


Maldives
**చంద్రుడు-మాల్దీవులు**


Burkina
**నక్షత్రము-బర్కిన**

పూర్వమునుండి దైవజ్ఞానములో వెనుకబడియున్న 73 దేశములు ఆకాశములోని మూడు గ్రహములను ఉన్నతముగా దైవసమానముగా భావించి దేశ జెండాలమీద గౌరవముగా పెట్టుకోగా, పూర్వము నుండి ఆత్మజ్ఞానములో అతి ఉన్నతస్థానములోవుండి, జ్ఞానమునకు గుర్తుగా ఇందువులనీ, జ్ఞాననిలయమైన భారతదేశము ఇందూదేశమనీ పేరుగాంచి యుండగా, నేడు జ్ఞానమును కోల్పోయిన మనము మన దేశ జెండా మీద సూర్య, చంద్ర, నక్షత్రములలో ఏ ఒక్కదానిని కూడా పెట్టుకోక మూడు రంగులనూ, ఒక బండిచక్రమునూ ఉంచుకొన్నాము. జెండాల విషయము అటుంచితే నేటికినీ భారతదేశములో సూర్యచంద్రాదులను కొందరు ఆరాధిస్తూనే ఉన్నారని ఒప్పుకోక తప్పదు. సూర్యనమస్కారములను పేరుతో సూర్యున్నీ, పౌర్ణమి పూజలను పేరుతో చంద్రున్నీ, అమావాస్య పూజలని నక్షత్రములను ఆరాధించడము జరుగుచున్నది. ఈ విధముగా ప్రపంచ నలుమూలల్లోనూ నాగరికతయున్నవారూ, నాగరికతలేనివారూ, తెలిసో తెలియకనో సూర్య చంద్ర నక్షత్రములను ఆరాధిస్తూనే ఉన్నారు. ఇందూ దేశమైన భారత దేశములో నేటికినీ కొన్ని చోట్ల సూర్యదేవాలయములు గలవు. సూర్య నమస్కారములని ఉదయము ఎవరో ఒకరు సూర్యునికి మ్రొక్కడము కూడా కలదు.

ఈ విధముగా చూస్తూపోతే భూమిమీద పూర్వము నుండి ఆకాశములోని మూడు గ్రహములకు దైవసంబంధముగా ఎంతో విలువ గలదు. గొప్ప విలువగల సూర్య, చంద్ర, నక్షత్ర గ్రహములను విశదీకరించు

కొని చూచితే సూర్యుడు ఎక్కువ తేజస్సు కలిగి ఎక్కువ కాంతినిచ్చుచూ మొదటి స్థానములోనున్నాడు. అలాగే రెండవస్థానములో చంద్రుడు సూర్యునికంటే తక్కువ తేజస్సు కలిగి తక్కువ కాంతినిచ్చుచున్నాడు. మూడవస్థానములో నక్షత్రము చంద్రునికంటే తక్కువ కాంతినివ్వడము తక్కువ ప్రకాశము కల్గియుండడమును గ్రహించవచ్చును. కాంతినివ్వడములోను, ప్రకాశముగా కనిపించడములోనూ మొదటి సూర్యుడు ఒకటవ స్థానములో నుండగా, చంద్రుడు రెండవస్థానములోనున్నాడు. అలాగే నక్షత్రము మూడవ స్థానములోనున్నది. దూరములో ఎవరు దూరముగా ఉన్నారని చూచితే కాంతిలో రెండవస్థానములోనున్న చంద్రుడు మనకు 3,84,401 కిలోమీటర్ల దూరములో ఉండగా, సూర్యుడు దాదాపు 14,96,00,000 కిలోమీటర్ల దూరములో ఉండగా నక్షత్రములు కొన్ని లక్షల కోట్ల కిలోమీటర్ల దూరములోనున్నవి. దీనిప్రకారము గమనిస్తే చంద్రుడు సూర్యునికంటే దగ్గరగా ఉన్నాడనీ, చంద్రుడు దగ్గరవాడు సూర్యుడు దూరము వాడు, నక్షత్రము ఇంకా దూరముగానున్నదని తెలియుచున్నది. మూడుగ్రహములను విడివిడిగా కాంతిలోనూ దూరములోనూ గమనించాము. అలాగే ఇంకో విధముగా కాలములో చూస్తే సూర్యుడు పగలు, చంద్రుడు రాత్రి, నక్షత్రము ఎల్లపుడు కనిపిస్తారు. అందువలన పగలుకు రాజు సూర్యుడనీ, రాత్రికి రాజు చంద్రుడనీ, ఎల్లవేళల రాజు నక్షత్రమని పూర్వమునుండి మన పెద్దలు చెప్పుచున్నారు. ఇప్పటకీ చాలామంది వ్రాసిన వ్రాతలలో రేరాజు చంద్రుడనీ, దినకరుడు సూర్యుడని కనిపిస్తూనే ఉండును.

ఆకాశములోని మూడు గ్రహములు కాంతిలోనూ, దూరములోనూ, అధికారములోనూ మూడురకములుగానే ఉన్నారు. **"గగనమ్ శూణ్యమ్, శూణ్యమ్ దైవమ్, దైవమ్ త్రైతమ్"** అని ఇపుడు మనము చెప్పుకొను చున్నాము. చివరకు దీని సారాంశము ఏమిటంటే దైవము మూడు

విధములుగా ఉన్నాడని అర్థము. ఆధ్యాత్మికములో ముఖ్యసూత్రము కూడా ఇదియే. కనిపించని దైవము (దేవుడు) కనిపించని మూడు భాగములుగా ఉన్నాడు. ఆ మూడు భాగములనే **భగవద్గీతలో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని** అన్నారు. అదే అర్థమయ్యేటట్లు చెప్పుకొంటే నాశనమగువాడు, నాశనముకానివాడు మరియు మొదటి ఇద్దరి పురుషుల కంటే అతీతుడు ఉత్తమమైనవాడని అర్థము. ఈ ముగ్గురినే ఇంకా బాగా అర్థమగునట్లు చెప్పుకొంటే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని చెప్పవచ్చును. ఈ త్రైతమైన దైవము కంటికి కనిపించువాడు కాదు. కనుక దైవమును తెలుపు నిమిత్తము కంటికి కనిపించు సూర్య,చంద్ర,నక్షత్రములు మూడింటిని శూణ్యములో దేవుడే ప్రతిష్ఠించాడు. అందువలన సూర్య, చంద్ర, నక్షత్రములను ప్రత్యక్ష దైవములని మన పెద్దలు చాలా సందర్భములలో చెప్పారు.

కనిపించని దైవమును తెలియుటకు కనిపించెడి సూర్య,చంద్ర, నక్షత్రములను పెట్టాడని చెప్పుటకు బలమైన తార్కాణము కూడా కలదు. అదేమనగా! దైవము భగవద్గీతలో విశ్వరూపసందర్శన యోగమను అధ్యాయములో **"నేను కాలమును"** అన్నాడు. ఆ కాలమును కొలుచుటకు సూర్య, చంద్ర, నక్షత్రములు తప్ప ఏ ఆధారమూ లేదు. అందువలన ఎటు చూచినా దైవమునకు, మూడు గోళములకు ఎంతో సంబంధమున్నదనియే చెప్పవచ్చును. ఇంతవరకు మనము చెప్పుకొన్నది అభౌతికమైన దేవున్ని తెలియుటకు భౌతికమైన సూర్య, చంద్ర, నక్షత్రాదులు ఆధారమనీ, భౌతికపద్ధతిగా కనిపించెడి సూర్య, చంద్ర, నక్షత్ర గోళములను గూర్చి చెప్పుకొన్నాము. ఇక ఆధ్యాత్మిక పద్ధతిగా వివరించుకొని చూస్తాము. ఇంతవరకు మనము చెప్పుకొన్న విషయమంతా విశ్వములోనున్న అందరికీ సంబంధించినదని గుర్తుంచుకోవలెను. విశ్వవ్యాప్తముగా అందరికీ

సంబంధించిన విషయము కావున ఇది ఏ ఒక్క మతమునకు సంబంధించినది కాదని జ్ఞప్తిలో పెట్టుకోవలెను. దేవుడు అందరిని సృష్ఠించాడు, దేవుడు అందరివాడు. దేవున్ని తెలుసుకోవడములో అందరికీ సమాన హక్కు ఉన్నది. అందువలన ఈ విషయము మతాతీతమైనదని గ్రహించవలెను.

భూమిమీద మనుషులను దేవుడు ఒకే పద్ధతిలో శరీరములను తయారు చేసి ఏ మతముగాని ఒకే ధర్మము ప్రకారము పుట్టిస్తే, మనిషి అధర్మములను ఆచరిస్తూ, అనేక మతములను సృష్ఠించుకొని, మనుషులంతా ఒకే జాతియని మరచిపోయి, మతపిచ్చిలో పడి తమజాతిని తామే ద్వేషిస్తూ ఒకరిమీద ఒకరు దాడులు చేసుకొనుచున్నారు. అటువంటి మత ద్వేషములు, మత హింసలు పోవాలంటే దైవజ్ఞానము తెలిసియుండాలి. దైవజ్ఞానము ప్రకారము మనిషిగానీ, జంతువుగానీ, పక్షిగానీ అన్ని జీవరాసులు మతములేనివై సమానముగా ఉన్నవి. దాని ప్రకారము మనుషులందరిలో దైవధర్మము సమానము. ఒక మనిషిని తీసుకొంటే అతని శరీరములో మూడు ఆత్మలు నివశిస్తున్నవి. శరీరము వేరు ఆత్మలు వేరు. శరీరము కనిపించుచున్నది, ఆత్మలు కనిపించవు. పైకి మనిషి ఏ మతము పేరు చెప్పుకొనినా, మా దేవుడు పలానా అని ఏ దేవుని పేరు చెప్పుకొనినా, శరీరములోపలి ఆత్మలు మాత్రము అందరిలో ఒకే ధర్మము ప్రకారము నిర్మింపబడియున్నాయి. మా మతములో ఆత్మలను గురించి చెప్పలేదనినా, మామతములో ఉన్నవి రెండు ఆత్మలే అనినా, లేక ఒకే ఆత్మనినా, మనకు ఇష్టమొచ్చిన మత విధానమును గురించి చెప్పినా, దేవుని ధర్మము ప్రకారము ప్రతి మనిషి మూడు ఆత్మలచే నిండియున్నాడు. ఆ మూడు ఆత్మలే జీవాత్మ, ఆత్మ, పరమాత్మయని జ్ఞప్తికుంచుకోవలెను. ఆధ్యాత్మికరంగమునకు ఈ మూడు ఆత్మలే ఆధారము. **ఎవరికైనా మూడు ఆత్మల వివరము తెలియనంతవరకు ఆధ్యాత్మికము తెలియనట్లే.** ఈ మూడింటినే త్రైతము

అంటున్నాము. త్రైతము శాస్త్రబద్ధముగా, సిద్ధాంత బద్ధముగా చెప్పబడినది కావున మూడు ఆత్మల శాస్త్రీయతను **"త్రైతసిద్ధాంతము"** అంటున్నాము. త్రైతసిద్ధాంతమును తెలియుట శరీరము ధరించిన ప్రతి మనిషికీ, శిరస్సుగల ప్రతి మతస్థునికీ అవసరము.

దేవుడు విశ్వములో జీవరాసులయందు మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడు. విశ్వములో మూడు ఆత్మలుగానున్న దైవము ఆకాశములో మూడు గోళములుగా కనిపిస్తున్నాడు. **దైవము తన ఉనికిని చాటుకొనుటకు ఆకాశములో సూర్య,చంద్ర, నక్షత్రములుగా కనిపించవలసి వచ్చినది. ఇందులో సూర్యున్ని జీవాత్మగానూ, చంద్రున్ని ఆత్మగానూ, నక్షత్రమును పరమాత్మగానూ పోల్చి చెప్పవచ్చును.** మతాలకు అతీతముగా ప్రతి శరీరములోనూ మూడు ఆత్మలు గలవు. ప్రపంచములో **మూడు ఆత్మలులేని మనిషిగానీ, జంతువుగానీ, పక్షిగానీ, చిన్న క్రిమిగానీ, కీటకము గానీ ఏదీలేదు. మూడు ఆత్మల విషయము నిగూఢమైన రహస్యము.** ఆ రహస్యమును తెలుసుకొనుటకు ఆధారముగానున్న సూర్య, చంద్ర, నక్షత్రములకు ప్రత్యేకతను కల్గించుటకు, వారములోని ఏడు దినములో మొదటి మూడు దినములకు ఈ మూడు గోళముల పేర్లనే ఉంచారు. వారములో ప్రారంభమగు మొదటి దినమునకు సూర్యుని పేరుండునట్లు ఆదివారమనియూ, రెండవ దినమునకు చంద్రుని పేరుండునట్లు సోమవారమనియూ, అట్లే మూడవ దినమునకు నక్షత్రము పేరుండునట్లు మంగళవారమనియు పేర్లు పెట్టడము జరిగినది. సూర్యున్ని ఆదిత్యుడు అంటారు అందువలన ఆదివారమనియూ, చంద్రున్ని సోముడు అంటారు కాబట్టి సోమవారమనియూ, నక్షత్రమును మంగళుడు అంటారు కావున మంగళవారమనియు చెప్పారు.

ప్రతి శరీరములోని జీవాత్మ అజ్ఞానసంబంధమైనది, ఆత్మ మాత్రము జ్ఞాన సంబంధమైనది, పరమాత్మ మోక్షసంబంధమైనది. అందువలన సూర్యుని దినమైన ఆదివారమును అజ్ఞాన జీవాత్మ పుట్టిన దినమనీ, చంద్రుని దినమైన సోమవారము ఆత్మజ్ఞానము పుట్టిన దినమనీ, నక్షత్రదినమైన మంగళవారము మోక్షము తెలిసిన దినమని చెప్పవచ్చును. ఇంకనూ వివరముగా చెప్పుకొంటే దేవుడు జీవులకొరకే విశ్వమును సృష్ఠించాడు. కావున ఆదినమును ఆదివారము అంటున్నాము. 'ఆది' అనగా మొదటి అనికూడా అర్థముగలదు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మలో మొదటివాడైన జీవున్ని సృష్ఠించిన దినము కావున ఆవిధముగా కూడా మొదటి దినమును ఆదివారము అనుచున్నాము. ఇదంతయూ మనుషులందరికీ సంబంధించిన విషయమని ముందే చెప్పుకొన్నాము కదా! దానిప్రకారమే నేటికి కూడా మనుషులు నివసించుచున్న ఎక్కడైనా ప్రపంచవ్యాప్తముగా ఆదివారము, సోమవారము, మంగళవారము మూడు గలవు. ఈ మూడు దినముల పేర్లు విశ్వవ్యాప్తముగా ఉండడమును బట్టి త్రైతమైన మూడు ఆత్మల విషయము అన్ని దేశములవారికీ, అన్ని మతములవారికీ తప్పనిసరిగా అత్యవసరముగా తెలియవలసిన అవసరమున్నది. అయితే ఇంతవరకు ఇటు స్వదేశమైన భారతదేశములోనూ, అటు పరదేశములైన 194 దేశములలోనూ మూడు ఆత్మల విషయముగానీ, వివరముగానీ ఏమాత్రము తెలియదు. ఇతర దేశములను వదలి మన భారతదేశ చరిత్రను త్రవ్విచూస్తే పూర్వము అన్ని దేశములకంటే భారతదేశమే ఎక్కువగా ఆత్మజ్ఞానమును తెలిసిన దేశముగా ఉండెడిది. చంద్రుడు ఆత్మ జ్ఞానమునకు చిహ్నాము కావున వారములో రెండవదినముగా ఉన్నదని చెప్పుకొన్నాము. రెండవ దినమును సోమవారమని అంటున్నాము. సోమవారమును 'ఇందు'వారమని కూడా అనెడివారు. ఇందు అనగా చంద్రుడు అని అర్థము. దానిప్రకారమే

'ఇందు' అనగా జ్ఞానము అనికూడా అర్థము. 'మతి' అనగా తెలివి (బుద్ధి) అని అర్థము. 'ఇందుమతి' అనగా 'జ్ఞానముగల బుద్ధి' అని అర్థము. ఈ విధానముతోనే ఇందుమతి అని పేరు కూడా మన దేశములో చాలామంది పెట్టుకొనెడివారు. పూర్వము అన్ని దేశములకంటే మిన్నగా ఆత్మజ్ఞానముగల మనుషులు మన దేశములో ఎక్కువగా ఉండెడివారు. కావున భారత దేశమునకు ఇందూదేశమని పేరు వచ్చినది. పూర్వము ఒకనాడు ఇందూదేశమని పేరుగాంచిన మన దేశము నేడు ఆత్మజ్ఞానము లేనిదై హిందూదేశముగా మారిపోయినది. 'ఇందూ' అను శబ్దమునకు అర్థము గలదు. 'హిందూ' అను శబ్దమునకు అర్థము లేదు. మనది అర్థములేని హిందూదేశముకాదు, అర్థమున్న ఇందూదేశమని విప్పిచెప్పినా అర్థము చేసుకోలేని అజ్ఞానులు సత్యము చెప్పే వారిమీదికి దాడికి దిగుచున్నారు. అనంతపురము జిల్లాలోని గుంతకల్లు మండలములో మతభక్తి తప్ప, దైవభక్తిలేని హిందూమతనాయకులమని చెప్పుకొనువారు అలాంటిపనికి పూనుకొన్నారంటే ఆశ్చర్యముకాదా!

ఇందూదేశము హిందూదేశముగా మారిపోయినప్పటికీ, ఆనాటికీ ఈనాటికీ ఎప్పటికీ భారతదేశము ఇందూదేశమే. ఎందుకనగా నేడు కూడా మూడు ఆత్మల త్రైత జ్ఞానమును గురించి, మూడు దినములైన ఆది, సోమ, మంగళవారముల విశిష్టతను గురించి తెల్పునది భారతదేశము లోనివారే. నేటికినీ ఇందూదేశమైన భారతదేశమునుండియే బయటి దేశములకు ఆత్మజ్ఞానమంటే ఏమిటో తెలియుచున్నది. ఇప్పటికి కూడా ఇందూజ్ఞానమే విశ్వవ్యాప్తముగానున్నదనుటకు పెద్ద తార్కాణము గలదు. ఆ ఆధారమేమనగా! ఆది, సోమ, మంగళవారములు మూడు అన్ని దేశములలోనూ గలవు. అంతేకాక వారమునకు ఏడు దినములు, నెలకు 30 దినములు ఇందూసాంప్రదాయము ప్రకారము గలవు. అన్నిటికంటే

ముఖ్యముగా అమెరికాలోగానీ, ఆంధ్రాలో గానీ మొదటి దినమైన సూర్యుని దినమును సూర్యుని పేరుతోనే సన్ (SUN) అనియూ, రెండవదినమైన చంద్రుని దినమును చంద్రుని పేరుతోనే మూన్ (MOON) అనియూ చెప్పుకొనుచున్నారు. మొదటి దినమైన సూర్యుని దినమును ఇంగ్లీషులో సన్‌డే అనియూ, రెండవదినమైన చంద్రుని దినమును మూన్‌డే అనియూ అన్ని విదేశీక్యాలెండర్లలోను గలవు. చిన్న పొరపాటు ఏమిటంటే ఆదివారమును సన్‌డే (SUN DAY) అని వ్రాసినవారు రెండవదినమును మన్‌డే (MON DAY) అని వ్రాశారు. దీనిని గమనిస్తే మన్‌డే ఉండవలసిన చోట వాస్తవానికి మూన్‌డే ఉండవలెను. కాలక్రమమున (MOON DAY) అని ఉండవలసిన చోట రెండు సున్నలలో ఒక సున్న ఎగిరిపోయి ఒక సున్న మిగలడము వలన (MON DAY) మండే అయినది. ఇది కేవలము కాలక్రమమున జరిగిన పొరపాటుగా గమనించవలెను. తెలుగు భాషలో మాత్రము మొదటి మూడు దినముల పేర్లు నేటికినీ చెడిపోకుండా అలాగే గలవు.

చంద్రుడు భూమికి దగ్గరగా ఉండినప్పటికీ, సూర్యుడు చంద్రుని కంటే దూరముగా ఉండినప్పటికీ వారములోని ఏడు దినములలో మొదట సూర్యుని దినమైన ఆదివారము (SUN DAY) ను ఉంచి, రెండవదినముగా చంద్రునిదినమైన సోమవారము (MON DAY)ను ఉంచడమేమిటనీ? మరియు దూరమును ఆధారము చేసుకొని మొదట సోమవారమునుంచి తర్వాత ఆదివారమునుంచడము సమంజసము కదా! అని కొందరడుగ వచ్చును. దానికి సమాధానము ఏమనగా! ఇంతకు ముందు పేజీలలో కాంతిని బట్టి సూర్యుడు మొదటివాడనీ, చంద్రుడిని రెండవవాడనీ, నక్షత్రము మూడవదనీ, దానినిబట్టి వారికి సమాన పోలికలలో సూర్యునికి జీవున్ని, చంద్రునికి ఆత్మను, నక్షత్రమునకు పరమాత్మను పోల్చుకొన్నాము.

దూరమును బట్టి చూస్తే  చంద్రుడు దగ్గర వాడే అయినప్పటికీ వారములో సూర్యున్నే మొదట ఉంచి ఆదివారమును మొదటి దినముగా ఉంచడమునకు ఆధ్యాత్మిక కారణము కలదని చెప్పవచ్చును.  అదేమనగా! చంద్రుడు భూమికి దగ్గరగా ఉన్నట్లు, శరీరములో కూడా చంద్రసమానమైన ఆత్మ శరీరమంత వ్యాపించి బయటి చర్మము వరకు, వెంట్రుకల వరకు ఉండి బయటి మనుషులకు దగ్గరగా ఉండినప్పటికీ, శరీర బాహ్య అవయవముల వరకు వ్యాపించి అన్నిటిని కదిలించి పని చేయిస్తూ ఉన్నప్పటికీ ఆత్మను ఎవరూ దగ్గరగా గుర్తించడములేదు.  ఆత్మ శరీరబాహ్య అవయవముల వరకు వ్యాపించియుండి పనిని చేయిస్తుందని ఎవరూ అనుకోవడములేదు.  భూమికి సూర్యుడు దూరముగా ఉన్నట్లు, శరీరములో కూడా సూర్యునితో సమాన పోలికయున్న జీవుడు బాహ్య ప్రపంచమునకు చాలా దూరముగా శరీరము లోపల నివాసమున్నాడు.  తల ఫాలభాగములో (నుదుటి భాగములో) తలలోపల గుణచక్రములో చిక్కుకొన్న జీవుడు బాహ్య అవయవములతో సంబంధము లేకుండా దూరముగా ఉండినప్పటికీ, ఏ అవయవమును జీవుడు కదిలించి పనిని చేయించనప్పటికీ, తానే అన్నీ చేస్తున్నట్లూ, తాను బయటి శరీరముగా ఉన్నట్లు తలచుచున్నాడు.  ప్రతి ఒక్కరు శరీరమును నేనే, నేనే శరీరమును అను భావముతో ఉన్న దానివలన దూరముగానున్న సూర్యున్ని మొదటి దినముగాయుంచి, దగ్గరగాయున్న చంద్రున్ని రెండవ దినముగా ఉంచడము జరిగినది.  దూరమును బట్టి లోపల గల ఆత్మనుగానీ, బయటగల చంద్రున్నిగాని తీసుకోక బాహ్యముగానున్న వెలుగును బట్టీ, అంతరముగానున్న భావమునుబట్టి, మొదట ఆదివారమును తర్వాత సోమవారమును ఉంచడము జరిగినది.  దీనిని ఎవరైనా కాదనగలరా? బాహ్యకాంతిని బట్టి, అంతర్ భావమునుబట్టి పెద్దలు నిర్ణయించినవే ఆది,సోమ,మంగళవారములనీ, ఇవియే ప్రపంచ వ్యాప్తముగా నేటికినీగలవనీ

తెలిసినపుడు ఎవరూ కాదనలేరు. నేడు చిన్నదిగా కనిపిస్తున్న ఇందూ సంస్కృతి పూర్వము ప్రపంచవ్యాప్తముగా ఉండెడిదని ఇప్పటికీనున్న సన్‌డే (ఆదివారము) వలన తెలియుచున్నది.

సన్‌డే (ఆదివారము) అయిన తర్వాత మూన్‌డే (సోమవారము) వస్తున్నది. మూన్‌డే (సోమవారము) తర్వాత స్టార్‌డే (నక్షత్రవారము) రావలయును. కానీ మూడవ దినము అలా స్టార్‌డే అనకుండా ట్యూస్‌డే అనుచున్నాము. ఇంగ్లీషు భాషలో ట్యూస్‌డే అనగా ఎర్రని గ్రహమైన కుజగ్రహ దినమని అర్థము. ఇది ఆంగ్లభాషలో (ఇంగ్లీషులో) ఉండే మూడవ దినము యొక్క పేరుండగా, తెలుగుభాషలో మూడవ దినమునకు నక్షత్రము యొక్క పేరే గలదు. నక్షత్రము యొక్క భావము ప్రకారము దానిని శుభకర దినమని చెప్పుచు మంగళవారమని అనుచున్నాము. ఇందూదేశమైన భారతదేశములో ఆత్మజ్ఞానముననుసరించి మొదటి మూడు పేర్లు మూడు దినములకుండగా, విదేశములలో మన ఇందూ సంస్కృతికి అద్దము పట్టినట్లు మొదటి రెండు దినములు సూర్య చంద్ర దినములుగానే ఉన్నవి.

షట్‌శాస్త్రములలో ఆరవశాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రములో అనగా భగవద్గీతలో విశ్వరూపసందర్శన యోగమునందు, 32వ శ్లోకములో **"కాలోస్మి"** అను పదమును దేవుడుపయోగించి చెప్పాడు. కాలోస్మి అనగా **'కాలమును నేనే'** అని అర్థము. దీనినిబట్టి దేవుడు కనిపించని కాల స్వరూపుడుగా ఉన్నాడని తెలియుచున్నది. కనిపించని కాలము మనముందరే క్షణక్షణము జరుగుచున్నది కానీ కాలమంటే ఏమిటో ఎవరికీ కనిపించదు. అంతేకాక కాలము మనముందరే దినములుగా, నెలలుగా, సంవత్సరము లుగా జరిగిపోవుచున్నప్పటికీ, అది అర్థము కానిదే కావున దేవుడు ఎవరికీ కనిపించడు, తెలియబడడు అని చెప్పవచ్చును. కనిపించని అభౌతికమైన

కాలమును భౌతికమైన గణితముతో దినముగా, మాసముగా, సంవత్సరముగా లెక్కించుకొంటున్నాము. అగమ్యమైన, అభౌతికమైన ఆకాశములో భౌతికమైన సూర్య, చంద్ర, నక్షత్రములు మూడు ఎట్లు త్రైతముగా కనిపిస్తున్నవో అలాగే అభౌతికమైన కాలము కూడా దినము, నెల, సంవత్సరము అను త్రైతముగానే తెలియుచున్నది. అంతేకాక ఇంకొక విధముగా గమనిస్తే సృష్టికర్తయిన కనిపించని పరమాత్మ అండజ, పిండజ, ఉద్భిజ అను మూడు కనిపించే జీవరాసులుగా విభజింపబడి త్రైతముగానే ఉన్నాడు.

1. **తెలియని ఆకాశము ఒకటికాగా తెలిసెడు సూర్య, చంద్ర, నక్షత్రములు మూడు (త్రైతము) గలవు.**
2. **తెలియని కాలము ఒకటికాగా తెలిసెడు దినము, మాసము, సంవత్సరము మూడు (త్రైతము) గలవు.**
3. **తెలియని పరమాత్మ ఒకటికాగా తెలిసెడు అండజ, పిండజ, ఉద్భిజము మూడు (త్రైతము) గలవు.**

ఈ మూడింటిలోను మొదటిదైన సూర్యచంద్రాదులను గురించి తెలుసుకొన్నాము. **గ్రహములైన సూర్యచంద్రాదుల గమనమును తెలుపునవి దినములు, మాసములు, సంవత్సరములు. దిన,మాస,సంవత్సరములు కాలములోని భాగములని తెలుసుకొన్నాము కదా! కాలమైన దేవునికి 108 కోట్ల సంవత్సరములు పగలుగా నిర్ణయింపబడినది. ఈ విషయము ఆరవ శాస్త్రములో అక్షర పరబ్రహ్మయోగమను అధ్యాయములో 17వ శ్లోకములో చెప్పబడినది. ఇది అక్కడి శ్లోకమును పరిశోధించి చూచితే తెలియబడును. శ్లోకములో వేయి యుగములు దేవునికి పగలుగా చెప్పబడినది. యుగములు ఉన్నవి నాలుగే కావున ఆ నాలుగు యుగములను 250 మార్లు లెక్కించి చూచితే దేవునికి ఒక పగలు**

**కాలము ఎన్ని సంవత్సరములైనది తెలియును. దేవుని యొక్క ఒక పగలు కాలమే ప్రపంచము యొక్క ఆయుష్షని తెలియుచున్నది.**

| | | |
|---|---|---|
| కలియుగము | 4,32,000 | సంవత్సరములు |
| ద్వాపరయుగము | 8,64,000 | సంవత్సరములు |
| త్రైతాయుగము | 12,96,000 | సంవత్సరములు |
| కృతయుగము | 17,28,000 | సంవత్సరములు |

నాలుగుయుగములు కలిసి 43,20,000 సంవత్సరములు కాగా వేయి యుగములకు మొత్తము 108 కోట్ల సంవత్సరములగుచున్నవి. 108 కోట్ల సంవత్సరములు, కాలము లెక్కలో (దేవుని లెక్కలో) ఒక దినముగా లెక్కించబడుచున్నది. దేవుని ఒక్క పగలును మాత్రము ప్రపంచ ఆయుష్షుగా నిర్ణయించడమైనది. ఆరవ శాస్త్రబద్ధమైన ప్రపంచ ఆయుష్షు అందరికీ తెలియునట్లు 108 సంఖ్యను ముఖ్యముగా అనేక సందర్భములలో మనము వాడుకొనుచున్నాము. 108 సంఖ్య సృష్ఠియందు కాలమును తెలుపుచున్నది. కావున ఈ సంఖ్య అందరికీ తెలియునట్లు ప్రతి మతములోను జపమాలను ఉపయోగించునట్లు చేసి, ఆ జపమాలలో 108 పూసలు ఉండునట్లు దేవుడుంచాడు. ప్రతి మనిషిలోను గుణముల సంఖ్య 108 ఉండునట్లు చేసిన దేవుడు, 108 గుణములుగల జీవరాసి 108 కోట్ల సంవత్సరముల సృష్ఠిలో జీవించునట్లు చేశాడు. 108 కోట్ల సంవత్సరముల తర్వాత ప్రళయమేర్పడును. అప్పుడు సర్వము నాశనము కాగలదు. అందువలన ప్రపంచ ఆయుష్షును ఎవరూ మరువకుండునట్లు జపమాలలో 108 పూసలనుంచడమేకాక, దానమిచ్చు సమయములో 108 రూపాయలను ఇచ్చునట్లు, పూజ చేయు సమయములో 108 పూలతో పూజించునట్లు చేశారు. అలాగే ప్రతి మంత్రమును 108 సార్లు జపించునట్లు చేశారు.

పెళ్లి సమయములో ఇచ్చు కానుకలను కూడా 108 సంఖ్యతో జోడించారు. ఇట్లు బయటి సమాజములో 108 సంఖ్యను అనేక సందర్భములలో వాడుకొనుచున్నాము.

అయినప్పటికీ 108 సంఖ్య ప్రపంచ ఆయుష్షని నేడు చాలామందికి తెలియకుండా పోయినది. పూర్వము జ్ఞానమును తెలిసినవారు 108 సంఖ్యను అనేక చోట్ల గుర్తుగా పెట్టుకోగా, నేడు జ్ఞానమును తెలియనివారు ఆ సంఖ్యను 101 గా మార్చుకొన్నారు. కొందరు 116 గా మార్చుకొన్నారు. ఇటువంటి వారిని చూచిన దేవుడు ప్రాణాపాయస్థితిలో ఆసుపత్రికి తీసుకొని పోవు అంబులెన్సు వ్యాన్ మీద 108 సంఖ్యను గుర్తించి నీ స్థిర ఆయుష్షు ఇంతేనని గుర్తుండునట్లు చేశాడు. నీకు అపాయస్థితి 108 సంఖ్యలోనే ఉన్నదన్నట్లు, అపాయస్థితిలో చేయవలసిన ఫోన్‌నంబరు కూడ 108 గానే ఉంచాడు. ఏది ఏమైనా 108 సంఖ్య ప్రపంచము యొక్క మొత్తము ఆయుష్షని మనిషి మరచిపోయాడు. 108 కోట్ల సంవత్సరములు సజీవముగానున్న ప్రకృతి, 108 కోట్ల సంవత్సరముల తర్వాత ప్రళయము చెంది విశ్వమంతా లేకుండా పోవును. 108 కోట్ల సంవత్సరముల విశ్వములేని విరామము తర్వాత తిరిగి సృష్టి ఏర్పడుచున్నది.

తిరిగి క్రొత్తగా ఏర్పడు సృష్టి ఇపుడు ఎట్లున్నదో అట్లేయుండును. అప్పుడు కూడ మూడు రకముల శరీరములతోనే జీవరాసులు ఉద్భవించును. అవియే త్రైతము ప్రకారము అండజ,పిండజ,ఉద్భిజములు. ఆకాశములోని సూర్య, చంద్ర, నక్షత్రాదులకు కాల పరిమాణములుగా దిన,మాస, సంవత్సరములు ఉండగా, దిన, మాస, సంవత్సరములు జీవరాసులైన అండజ, పిండజ, ఉద్భిజములకు ఆయుఃపరిమాణములుగా ఉన్నవి. ఇట్లు ఒకదానితో ఒకటి సంబంధపడియున్నవి. భూమిమీద కనిపించెడు జీవరాసులు ఉండగా, ఆకాశములో కనిపించే గ్రహములు ఉండగా, మధ్యలో

కనిపించని కాలము దైవమునకు గుర్తింపుగా ఉన్నది. కనిపించని కాలము దిన,మాస, సంవత్సరముల పరిమాణముతో ఉన్నది. అటువంటి దినములకు ఏడు పేర్లు, మాసములకు పండ్రెండు పేర్లు, సంవత్సరములకు అరువదిపేర్లు మన పెద్దలుంచారు. ఏడు దినములలో ప్రతి దినమునకు చివర వారము అని 7 పేర్లుండడము, ప్రతి నెలకు చివర మాసము అని 12 పేర్లుండడము, అట్లే సంవత్సరమునకు చివర వత్సరము అని 60 పేర్లుండడము గమనించ వచ్చును. కాలమునకు వార, మాస, వత్సరములని పేర్లున్నవని అందరికీ తెలుసు. కానీ ఇక్కడ కాలక్రమమున **"మూస"** అను పదము **"మాస"** అని మారియున్నది. అందువలన అందరికీ తెలిసిన మాస పదమునే మనము కూడా చెప్పుకొంటున్నాము. అట్లే **"యోగము"** అను పదము **"యుగము"** అను పదముగా మారిపోయినది. దానిని కూడ మనము యుగము అను పదముగానే చెప్పుకొన్నామని గ్రహించవలెను. ఉదాహరణకు చైత్రమూసము చైత్రమాసముగా చెప్పుకొంటున్నాము. అదే విధముగా కలియోగమును కలియుగముగా వ్రాసుకొన్నాము.

కాలములోనే ప్రతి జీవరాసి పుట్టుచున్నది. అనగా దైవము ప్రతి జీవరాసిని సృష్టిస్తున్నాడని ప్రత్యక్షముగా తెలియుచున్నది. కనిపించని దైవము ప్రతి జీవరాసిని తేడా కలిగిన ఆకారముతో పుట్టించుచున్నాడు. అందువలన కాలమునకు వార, మాస, వత్సరమని పేర్లుంచడము జరిగినది. వారము అనగా తేడా కల్గిన, మాసము అనగా ఆకారముగా, వత్సరము అనగా పుట్టించబడినదని అర్థము. ఈ అర్థము ప్రకారము పుట్టిన మనిషి మనిషికి తేడా కల్గిన ఆకారము కలదని అందరికీ తెలియుచున్నది. ప్రతి మనిషికి కొద్దిపాటి ముఖవర్ఛస్సులోనే ఎన్నో తేడాలుండడమును అందరూ గ్రహించ వచ్చును. దీనివలన ప్రతి మనిషి వారాగా (తేడా) మూస (ముద్ర) పోయబడిన ఆకారముతో వత్సరింపబడు (పుట్టింపబడు) చున్నాడని తెలియుచున్నది.

ఇక్కడ వారము అనునది ఏడు పేర్లు కల్గియుండడము అందరికీ తెలుసు. వారమునకు ఏడు పేర్లే ఎందుకు పెట్టారు? అని ప్రశ్నించుకొని చూస్తే ఆ ప్రశ్నకు జవాబు ఈ విధముగా తెలియుచున్నది.

భూమి మీదున్న ప్రతి మనిషి బయట కనిపించెడి సూర్య చంద్ర నక్షత్రాదుల వెలుగులోనూ, లోపల కనిపించని మూడు ఆత్మల ప్రభావము తోనూ జీవించగల్గుచున్నాడు. బయట గ్రహముల కాంతి కిరణము ఏడు తేడాలుగా (వారాలుగా) ఉన్నది. అలాగే లోపల ఆత్మల ప్రభావము కూడ ఏడు వారాలుగా (తేడాలుగా) ఉన్నది. కాంతి కిరణములను విభజించితే ఏడు విధ రంగులు తెలియుచున్నవి. ఆత్మశక్తిని విభజించితే ఏడు నాడీకేంద్రములలో ఏడు రకముల శక్తిగాయున్నది. అందువలన మనిషి జీవించు దినమునకు ఏడు పేర్లు పెట్టవలసివచ్చినది. ఆ ఏడు పేర్లలో ముందుగల మూడు పేర్లు సూర్య, చంద్ర, నక్షత్రములకు సంబంధించినవిగా ఉండడము గమనించదగ్గ విషయము. ప్రస్తుత కాలములో నాగరికత అను పేరుతో, విజ్ఞానమను చదువుతో అజ్ఞానములో మునిగిపోయిన మనిషి, ఆది, సోమ, మంగళవారముల విశిష్ఠతను విస్మరించినవాడై, తనకు సంబంధించిన జ్ఞానమును తానే తెలుసుకోలేకపోయాడు. విజ్ఞానము కల్గి సుఖాలలో మునిగిపోయిన నేటి మనుషులకంటే ఆత్మజ్ఞానము కల్గి ఆది, సోమ, మంగళవారముల అర్థమును తెలిసిన పూర్వపు మనుషులే ఎంతో గొప్ప అని తెలియుచున్నది.

ప్రతి మనిషి తేడా కల్గిన ముఖముతో, మూసపోసిన ఆకారముతో, పుట్టించబడియున్నాడని అందరికీ తెలుసు. అటువంటి మనిషి సూర్య చంద్ర, నక్షత్ర మూడు గ్రహముల కాంతిలో, మూడు ఆత్మల ప్రభావములో బ్రతుకగలుగుచున్నాడు. దైవము ఆకాశములో భౌతికముగా కనిపించెడి

రెండు గ్రహములుగా, ఒక అగ్రహ నక్షత్రముగా శరీరములో కనిపించని మూడు ఆత్మలుగా ఉన్నాడని చెప్పుకొన్నాము కదా! దీనిని బట్టి ప్రతి మనిషి ఇటు బయటి గ్రహముల వలన, అటు లోపలి ఆత్మల వలన మొత్తముగా దైవము వలన జీవించుచున్నాడని తెలియుచున్నది.

**దైవము కనిపించే విధముగా సూర్య చంద్ర నక్షత్రములుగా**
**దైవము కనిపించని విధముగా జీవాత్మ ఆత్మ పరమాత్మలుగా**
} **విభజింప బడియున్నది.**

దైవప్రభావములో ఇటు బయట, అటు లోపల జీవించు మనిషి బయటి సూర్య, చంద్ర, నక్షత్రములను, లోపలి జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను తెలిసి ఆరాధించడమునే త్రైతారాధన అంటున్నాము. త్రైతారాధనలో బయటి సూర్య చంద్ర నక్షత్రముల గుర్తులైన ఆది, సోమ, మంగళవారములలో మూడు ఆత్మలను ఆరాధించడమునే త్రైతారాధన అంటున్నాము. కొందరు పెద్దలు జ్ఞానమును తత్త్వములను పాటలరూపములో పాడునపుడు "మూడునాళ్ళ జీవితమునకు మురిసిపోయేవెందుకు జీవా" అని పాడుచుండుట వినియున్నాము. దీనిని బట్టి మన జీవితము మూడునాళ్ళేనా అని యోచిస్తే ఒక దినము పుట్టడమునకు, ఒకదినము జ్ఞానము తెలుసు కొనుటకు, ఒక దినము మోక్షమును పొందుటకని తెలియుచున్నది. మొదటి దినము జీవుడు పుట్టి, రెండవ దినము ఆత్మను తెలుసుకొని, మూడవ దినము పరమాత్మలో చేరవలెనని కూడా తెలియుచున్నది. అందువలన కొందరు కవులు,పెద్దలు **'ఎంతో చిన్నది జీవితం, ఇంకా చిన్నది యౌవ్వనమ్'** అన్నారు. ఈ విషయమును బ్రతికియున్నవారు తెలుసుకొనుటకు చచ్చిన వారికి మూడవ దినమును చేయుచుందురు. దీనినిబట్టి మనకు తెలిసినా, తెలియకుండినా జీవితము మూన్నాళ్ళ ముచ్చటని తెలియుచున్నది. ముచ్చటించడము అనగా ఒక విషయమును గురించి మాట్లాడుకోవడము

అని అర్థము. మూన్నాళ్ళ ముచ్చటనగా ఆది,సోమ,మంగళ అను మూడు దినములలోని విషయమును తెలుసుకోవడమని అర్థము. అలా తెలుసుకోక పోతే ప్రపంచములో ఎవరు ఏ హోదాలో బ్రతికినా వారి జీవితము వృథా అనియే తెలియుచున్నది. అందువలన భూమిమీద పుట్టిన ప్రతి మనిషి ఏ మతస్థుడైనా త్రైతారాధనను తెలిసి తీరవలసిందే మరియు చేసి తీరవలసిందే. ఇది ఆత్మలకు సంబంధించిన జ్ఞానము కావున మనుషులందరికీ కావలసిన, మతాలకు అతీతమైన ఆచరణయని తెలియవలెను.

త్రైతారాధన భావపూరితమైనది. కావున ఏడు దినములలో మొదటి మూడు దినములైన ఆది, సోమ, మంగళవారములలో చేయడమే కాక, శరీరములోని ఏడు నాడీకేంద్రములలో మొదటి మూడు కేంద్రములైన కంఠస్థానమునూ, భ్రూమధ్యస్థానమునూ, కపాలస్థానమును గుర్తించుకొని మూడు స్థానముల లోపలే తలలో ధ్యాస ఉండునట్లు చేయుటకు ఆరాధన సమయములో కుడిచేయి హస్తమును తల మీదా, ఎడమచేయి హస్తమును గడ్డము క్రింద ఉంచుకోవలెను. మూడు ఆత్మలకు గుర్తుగా మూడు కోణముల గుడ్డను తలకు కట్టుకోవలెను. ఇప్పటికి ఇదంతయూ క్రొత్తగా కనిపించి నప్పటికీ, ఇదేదో పరమతబోధని కొందరికనిపించినప్పటికీ, పూర్వము కొన్ని లక్షల సంవత్సరముల పూర్వము ఏ మతమూలేని కాలములోనే త్రైతారాధనను జ్ఞానులు ఆచరించెడివారని తెలియవలెను. అన్ని సంవత్సరముల పూర్వమున్నది మాకుగానీ, ఏ పీఠాధిపతికిగాని, ఏ మఠాధిపతికిగాని తెలియనిది ఇప్పుడు నీకెట్లు తెలియునని కొందరికి ప్రశ్నరాగలదు. దానికి జవాబు నాకు కూడా ఏమాత్రము తెలియదు. కానీ నాలోని రెండవవాడైన ఆత్మకు అన్నీ తెలుసు కావున ఆయన చెప్పి వ్రాయిస్తున్నది వ్రాస్తున్నాను. నీలో కూడా ఆత్మ ఉన్నది, అయినా నీవు అడగవు ఆయన చెప్పడు, అంతే

మీకు నాకు తేడా. ఇంకా ఆయన చెప్పునదేమనగా! "వారములో ముందు గల ఆది, సోమ, మంగళ వారములను గురించి మీకు తెలియని దానిని విపులముగా చెప్పెదను శ్రద్ధగా వినండి" అంటున్నాడు.

## ఆదివారము

"ఆది" అనగా ప్రపంచరీత్యా మొదటిదని అర్థము. ఆధ్యాత్మికరీత్యా చావుపుట్టుకలు గల క్షరాత్మయిన జీవాత్మని అర్థము. దైవము జీవునికొరకే సృష్ఠిని ప్రారంభించ వలసివచ్చినది. మొదట జీవున్ని సృష్ఠించిన దినమును ప్రపంచరీత్యా ఆదివారమనియు, ఆధ్యాత్మికము ప్రకారము రవి (సూర్యుని) దినమనియు చెప్పుచున్నాము. ప్రపంచరీత్యా మొదటి (ఆది) దినమైనప్పటికీ చావు పుట్టుకలతో సమానముగా ఉదయించుచూ మరియు అస్తమించుచూ సూర్యుడు జీవునివలె ఉన్నాడు కావున ఆదివారమును రవి వారమని కూడా అనుచున్నాము. ఏది ఏమైనా సృష్ఠి ఆవిర్భవించిన దినము ఆదివారము. దైవము ప్రత్యక్షముగా ఉంటూ ఇటు ఆత్మనూ, అటు జీవాత్మనూ శరీరముతో పుట్టించిన దినము ఆదివారము. మూడు ఆత్మలలో మననుండి మొదటిది జీవాత్మ, రెండవది ఆత్మ, మూడవది పరమాత్మ ఉండగా మొదటి జీవాత్మ ఉద్భవించిన దినము కావున దానిని ఆదివారము అంటున్నాము. బయటి సూర్యుని దినమైన రవివారమనినా, లోపలి జీవాత్మ దినమని ఆదివారమనినా రెండూ ఒక్కటేనని తెలియవలెను. దైవము తన ప్రకృతిచేత జీవులను సృష్ఠించిన కార్య ఆరంభ దినము కావున దీనిని 'దైవకార్య ఆరంభ దినము' అంటున్నాము. దైవము తన సంకల్పము చేత సర్వమును సృష్ఠించిన దినము కావున మొదటి దినమైన ఆదివారమును సంకల్పదినమని కూడా పూర్వమనెడివారు. అన్నిటికంటే శ్రేష్ఠమైన దైవము చేత తయారైన దినము

కావున శ్రేష్ఠదినమనియూ, పవిత్రమైన దైవము చేత తయారైన దినము కావున పవిత్రదినమనియూ ఆదివారమునకు పేర్లు గలవు. ఇపుడు ఈ విధముగా మారియుండినా పూర్వము మొదటి దినమును ఆదివారమనియూ, దైవకార్య ఆరంభ దినమనియూ, శ్రేష్ఠదినమనియూ, పవిత్రదినమనియూ గొప్పగా చెప్పుకొనెడివారు.

ఒక విధముగా చెప్పితే రోమ్, గ్రీక్‌దేశములలో దేవతల మీద గ్రహముల మీద భక్తి ఎక్కువగా ఉన్ననూ మన దేశములో ఆ దేశములను మించిన జ్ఞానముండెడిది. అందువలన జ్ఞానములో అగ్రదేశమైనందున మన దేశమును ఇందూదేశమని ముందునుండి అన్ని దేశములవారు పిలిచెడి వారు. మొదట ఇందూ (జ్ఞాన) దేశమైన మన దేశమునకు భరతుని కాలమునుండి భారతదేశమని పేరు వచ్చినది. దీనిని భారతదేశమనినా ఆది నుండి జ్ఞానముగల దేశము కావున దీనికి ఇందూదేశమనెడి పేరు అతుక్కు పోయినది. ఇందూత్వము అనగా దైవజ్ఞానము ఈ దేశములో సన్నగిల్లిపోయి **ఇందూ** అను పదము **హిందూ**గా మారిపోయినదని మేము అనేక సందర్భములలో చెప్పాము. ఇందూ అను శబ్దము కొంత మార్పుచెంది హిందూ అని పలుకబడుచున్నప్పటికీ జ్ఞానములో ఇతర దేశములకంటే ఈ దేశమే గొప్పది. కావున అర్థమును తెలిసి ఈ దేశమును ఇందూదేశముగా చెప్పుకొందాము. ఈ దేశము జ్ఞానముగల దేశమని తెలిసి మన దేశములో చెప్పిన జ్ఞానమును మొదట ప్రపంచదేశములన్నీ అనుసరించెడివి. అంటే ఇందూదేశమైన భారతదేశము అన్ని దేశములకు మార్గదర్శకముగా ఉండెడిదని అర్థమగుచున్నది. అన్ని దేశములకు మార్గదర్శకమైన ఇందూదేశములోనే సూర్యచంద్ర నక్షత్ర వరుస క్రమమునూ, దాని ద్వారా జ్యోతిష్యశాస్త్రమునూ బయటకు వచ్చినవి. సూర్యుడు మొదటివాడని, ఏడు రోజులలో మొదటిది ఆదివారమని ఇందువులు చెప్పినట్లు

ప్రపంచదేశములన్నియూ ఆదివారమునే మొదటి దినముగా ఉంచుకొన్నవి. ఆదివారము దేవుడు సృష్ఠించిన, తయారు చేసిన పవిత్ర దినము కావున ఆ దినమును పవిత్రముగా ఉంచుకొని దేవుని ధ్యాసలోనే, దేవుని జ్ఞానములోనే ఇందువులు గడిపెడివారు. ఆ దినము ఏ పనిని చేయకుండా సృష్ఠి ఆవిర్భదినముగా, తాము పుట్టిన దినముగా చెప్పుకొనుచు సృష్ఠికర్తయిన దేవుని గొప్పతనమును కొనియాడెడివారు. అందువలన ఆదివారమును ఇందువులు సెలవుదినముగా పెట్టుకొని ఏ పనిని చేయకుండా దేవుని జ్ఞానమును తెలుసుకొనుటకు ఉపయోగించెడి వారు. ఇందూదేశ ప్రజలు అన్ని దేశప్రజలకు ఆదర్శముగా ఉండుట వలన ఇందువులవలె ప్రపంచ దేశములన్నియు ఆదివారమును మొదటి దినముగా పెట్టుకోవడమేకాక ఆదివారమును వారు కూడా పవిత్ర దినముగా, సెలవుదినముగా చేసుకొన్నారు. ఇంగ్లీషులో హోలీడే (Holy Day) అనగా పవిత్రదినమని అర్థము. పూర్వము ఆదివారమును విదేశాలలో కూడా హోలీడే అని అనెడి వారు. కాలక్రమమున హోలీడే కాస్త హాలీడేగా మారిపోయినది. పవిత్ర దినమును సెలవుదినముగా ఉంచుకొను ఆచారము పూర్వము నుండి విదేశములలో కూడా ఉండెడిది. Holy Day (హోలీడే) చివరకు Holi Day (హాలీడే) గా మారిపోయి నేడు సెలవుదినమును హాలీడే అని, సండే ఈజ్ హాలీడే అంటున్నారు. పూర్వము సన్‌డే ఈజ్ హోలిడే అనెడివారు. ప్రపంచములో ఏ మతములేని కాలములోనే ఆదివారము సెలవు దినముగా ఉండడము మొదలై నేటికినీ ఆ సాంప్రదాయము ప్రపంచమంతా మిగిలియున్నది.

ఇందువులు ఆదివారమును శుచి, శుభ్రతతో పండుగ వాతావరణములో గడిపెడివారు. ఆ దినమును పవిత్రముగా గొప్పగా చూచుకొనుట వలన దుర్వ్యసనములైన మత్తుపానీయములను త్రాగడము

కానీ, మాంసమును తినడముకానీ, చెడుగా మాట్లాడముకానీ, చెడుగా ప్రవర్తించడముగానీ చేసెడివారు కాదు. వారములోని ఏడు రోజులలో ఆరు రోజులు తమకై వినియోగించుకొనినా ఆదివారము ఒక్క దినము దేవుని కొరకు పనిని చేయాలనుకొనెడివారు. ఇందువులను చూచి ప్రపంచ దేశములన్నియూ ఆదివారమును పవిత్రముగనే గడిపెడివారు. కాలము గడుచుకొద్దీ జ్ఞానులు అజ్ఞానులుగా మారిపోవుచు వచ్చారు. రాజులు పోయినా వారి కోటలు శిథిలావస్థలో మిగిలి ఉన్నట్లు, ఇందూ సాంప్రదాయములు అడుగంటిపోయినా వాటికి తార్కాణముగా ఆదివారము సెలవుదినముగా మిగిలిపోయినది. ఇందూదేశములో అజ్ఞానము చోటు చేసుకొని ఇందుత్వము ప్రశ్నార్థకమైనది. ఇందువులు పవిత్రముగా ఉంచుకొనిన మొదటి దినమును అనగా ఆదివారమును, వారము చివరి దినముగా ఉంచుకొన్నారు. చాలామంది వారాంతమైన ఆదివారము అని పల్కుచున్నారు. అయినప్పటికీ విదేశీసాంప్రదాయ క్యాలెండర్లలో కూడా ఆదివారము మొదటి దినముగా పైననే ముద్రించడము నేటికినీ జరుగు చున్నది. కానీ ఆచరణలో ఆదివారము పవిత్రదినము కాకుండా భ్రష్టుపట్టిన దినమైనదని చెప్పక తప్పదు. ఎందుకనగా అన్ని దురలవాట్లకు ఆదివారము అడ్డాగా మారిపోయినది. ఆదివారమును ప్రత్యేకించి మాంసభక్షణ దినముగా పెట్టుకోవడము, మత్తుపానీయములు త్రాగడము, జూదమాడడము జరుగు చున్నది. సెలవుదినమైనందున అన్ని విలాస కార్యములకు ఆదివారము నెలవైనది. ఆదివారము సెలవు దినముగా ఎందుకున్నదని యోచించని వారు దానిని అజ్ఞాన పనులకు ఉపయోగించుకొనుచున్నారు. ఆదివారమును చివరి దినముగా చాలామంది అనుకోవడము జరుగుచున్నది. దేవుని ఆరాధనగానీ, దేవుని జ్ఞానమును గురించి తెలుసుకోవడముగానీ జరగడము లేదు. ఆదివారము జీవునికి సంబంధించినదనీ, జీవుడు పుట్టిన దినమని

మరచిపోయారు. ఆదివారస్థానములో గురువారమూ, సోమవారస్థానములో శుక్రవారమూ, మంగళవారస్థానములో శనివారము చోటుచేసుకొన్నాయి. పూర్వము ఆది, సోమ, మంగళవారములు ముఖ్యమైనవి పవిత్రమైనవి కాగా ఇప్పటికాలములో గురు, శుక్ర, శనివారములు పవిత్రతను సంపాదించు కొన్నాయి. గురు,శుక్ర,శనివారములలో మనుషులు శుచి శుభ్రతను పాటిస్తూ దేవతల పూజలు చేయడము జరుగుచున్నది. ఈ విధముగా ఆదివారము ఇందువులలో ప్రాధాన్యతను కోల్పోయి చాలాకాలమైనది. అయినప్పటికీ ఇప్పుడు ఆదివారము యొక్క ప్రాధాన్యతను ఆత్మ మనకు గుర్తు చేయుచున్నది.

కోట్ల సంవత్సరములనుండి ఇందువులలో ప్రాధాన్యత సంపాదించు కొన్న ఆదివారము మాంసభక్షణ దినముగా మారిపోగా, అర్థముతో కూడుకొన్న ఇందూ అను శబ్ధము అర్థములేని హిందూ శబ్ధముగా మారిపోయినది. ఇందూ సాంప్రదాయములను తెలియని స్థితిలో హిందువులు నిలిచిపోయారు. సాధారణమనుషులకే కాక స్వామీజీలకు కూడ దైవధర్మములూ, జ్ఞానసాంప్రదాయములు తెలియకపోయినందువలన హిందువులలో కొందరు పరమతముల వ్యామోహమును పెంచుకొని ఇక్కడ లేనిదేదో అక్కడ దొరుకుతుందని భ్రమపడి మతములు మారుచున్నారు. **ప్రపంచ దేశములన్నిటికీ ఆదర్శప్రాయమైన జ్ఞానముకల ఇందూదేశములోనే మరియు వందశాతము జ్ఞానమును బోధించు భగవద్గీత పుట్టిన ఇందూదేశము లోనే ఇందూమతమును వదిలి ఇతర మతములను కొందరు స్వీకరిస్తున్నారు. ఇందూమతము గనిలాంటిది, ఇతర మతము నిధిలాంటిది అని తెలియక చాలామంది మతమును మారుచున్నారు. గనిలో దొరికిన దానిని తీసుకొని పోయి మరొక చోట ఉంచితే అది నిధి అవుతుంది. ఇందూత్వ గనిలో పుట్టిన జ్ఞానమే ఇతరచోట్ల, ఇతర మత నిధులుగా ఉన్నవని తెలియనివారు అలా ఇతరమతములకు ప్రాకులాడుచున్నారు. గని త్రవ్వేకొద్దీ దొరుకుతుంది, నిధి త్రవ్విన**

**ఒకరోజే దొరుకుతుంది. అందువలన గని శాశ్వితము, నిధి అశాశ్వితమని చెప్పవచ్చును. ఎవరికైనా వాడు పుట్టిన మతమే గనిలాగ ఉంటుంది. పరమతము నిధిలాగే ఉంటుంది. గనిలోలేనిది నిధిలో దొరకదు. నిధిలో దొరికినదేదో అది గనిలోనిదే. అందువలన మతమార్పిడి చేసుకోవడము పొరపాటని మేము చెప్పకతప్పదు.**

కోట్ల సంవత్సరముల పూర్వమే ఆదివారము తయారై ఉంటే వందల సంవత్సరముల పూర్వము తయారైన మతములు కూడా ఆదివారమును మార్చలేకపోయాయి. అందువలన ఆదివారము ఇతరదేశములలో కూడా ముఖ్యదినముగానే ఉన్నది. ప్రపంచములోనే మొదటి దినమైన ఆదివారమునూ గ్రహములలో మొదటిదైన సూర్యున్నీ ఆధారము చేసుకొని, ఆత్మలలో మొదటిదైన జీవాత్మకొరకు జ్యోతిష్యశాస్త్రమును ఇందువులు తయారు చేశారు. షట్ శాస్త్రములలో ఒకటైన జ్యోతిష్యశాస్త్రము ఆదివారమే మానవుని మెదడులో మెదిలి తయారైనది. ఆదివారము పుట్టిన జీవునికి ఆదివారము పుట్టిన జ్యోతిష్యము కర్మను తెలియజేయుచున్నది. ఈ విధముగా ఎన్నో విధముల ఆదివారము ముఖ్యదినముగా గుర్తింపు పొందివున్నది. ప్రపంచములో ఉత్తర, దక్షిణ దిశలలో వ్యాపించియున్న అయస్కాంతశక్తి ప్రత్యేకించి ఆదివారములో మానవుని మీద ఎక్కువ ప్రభావమును చూపుచున్నది. ఒక్క మానవుని మీదేకాక పంచభూతముల మీద కూడా ప్రభావమును చూపుచున్నది. ఆదివారము అమావాస్యదినము అయినా, పౌర్ణమి దినము అయినా మరీ ఎక్కువ ప్రభావముండుట వాస్తవము. ఆదివారము అభౌతికమైన సూక్ష్మములకు శక్తివంత దినముగా ఉన్నదని పూర్వమందరికీ తెలుసు. ఇట్లు స్థూలముగా సూక్ష్మముగా ఆదివారము అన్ని విధముల ప్రాశస్త్యత పొందియున్నదని తెలియవలెను.

# సోమవారము

ఒక దేశములో ఒక ప్రభుత్వముంటుంది. ప్రభు అనగా రాజు అని అర్థము. ప్రభువుచేత పాలింపబడునది కావున దానిని ప్రభుత్వము అంటాము. బయటి దేశములో ప్రభువూ ప్రభుత్వమూ ఉన్నట్లే, లోపలి దేహములో కూడా ఒక దేవుడూ దైవత్వమూకలదు. దేశములోని ప్రభుత్వమునకు చట్టముంటుంది. అలాగే దేహములోని దైవత్వమునకు ధర్మముంటుంది. దేశములోని చట్టమును తెల్పునది న్యాయము. అలాగే దేహములోని ధర్మమును తెల్పునది జ్ఞానము. చట్టము తెలియాలంటే న్యాయశాస్త్రమును చదవాలి. అట్లే ధర్మమును తెలియాలంటే జ్ఞానముగల యోగశాస్త్రమును చదవాలి. న్యాయశాస్త్రము యల్.యల్.బి పుస్తకములలో గలదు, దానిని బోధించుటకు ప్రొఫెసర్లు గలరు. అదే విధముగా జ్ఞానము గల యోగశాస్త్రము భగవద్గీత రూపములో గలదు, దానిని బోధించుటకు స్వామీజీలు (యోగులు) గలరు. దేశములోని న్యాయమునకు అధిపతిగా న్యాయశాఖ మంత్రి ఉంటాడు. అలాగే దేహములోని జ్ఞానమునకు అధిపతిగా చంద్రుడు గలడు. ఈ విషయమునే క్రింద వివరముగా చూడండి.

| బయటి దేశములో | --- లోపలి దేహములో |
|---|---|
| దేశము | దేహము |
| ప్రభుత్వము | దైవత్వము |
| ప్రభువు | పరమాత్మ |
| చట్టము | ధర్మము |
| న్యాయము | జ్ఞానము |
| న్యాయశాస్త్రము | యోగశాస్త్రము |

| | |
|---|---|
| **ఎల్.ఎల్.బి** | **భగవద్గీత** |
| **ప్రొఫెసర్లు** | **స్వామీజీలు (యోగులు)** |
| **మంత్రి** | **చంద్రుడు (ఇందువు)** |

బయటి దేశములూ చట్టములూ మారవచ్చును, ప్రభువులూ ప్రభుత్వములూ మారవచ్చును, కానీ లోపలి దేహములుగానీ, ధర్మముగానీ, దేవుడుగానీ, దైవత్వముగానీ ఎప్పటికీ మారవు. అందువలన బయటిదంతా అశాశ్వితమనీ లోపలిదంతా శాశ్వితమని మన పెద్దలు చెప్పుతూవచ్చారు. బయటి ప్రభువులూ ప్రభుత్వములూ అశాశ్వితమైనవని లోపలి దేవుడు దైవత్వము శాశ్వితమని అందరూ జ్ఞప్తికి పెట్టుకోవలెను. శాశ్వితమైన దేవుని కొరకు ఆయన ధర్మమునూ, ఆయన ధర్మము కొరకు జ్ఞానమునూ తెలియవలెను. జ్ఞానమునకు అధిపతి చంద్రుడని చెప్పుకొన్నాము. చంద్రుడినే ఇందువనీ, సోముడనీ అనుచున్నాము. మొదటి దినమైన ఆదివారము సృష్ఠి జరిగిన తర్వాత రెండవదినమున జ్ఞానము తెలిసినది. కావున రెండవ దినమునకు జ్ఞానాధిపతియైన చంద్రుని పేరునుంచుతూ ఆ దినమును ఇందువారమనీ, సోమవారమని పిలుస్తున్నాము. ఈ విధముగా సృష్ఠి తర్వాత రెండవ దినమును జ్ఞాన దినముగా పరిగణించవలసి వచ్చినది.

ప్రతి మనిషికి జ్ఞానము తెలియవలసినది తలకు. మనిషి తలకు ఒక్కమారుగా జ్ఞానమంతా తెలియదు. మొదట కొద్దిగా జ్ఞానమును తెలుసుకొన్నవాడు జ్ఞానాన్ని దినదినాభివృద్ధి చేసుకొనుచు చివరకు సంపూర్ణముగా తెలియవలెను. జ్ఞానము సముద్రములాంటిది. ఇన్ని రోజులలో తెలుసుకుంటామని ఎవరూ చెప్పలేరు. ఎంతో కాలము జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొంటూనే ఉండాలి. అందువలన జ్ఞానమును అభివృద్ధి చెందుతున్న చంద్రవంకతో సమానముగా పోల్చారు. సంపూర్ణ జ్ఞానిని

పూర్ణచంద్రునితో సమానముగా పోల్చబడమైనది. మనిషి జ్ఞానాన్ని తన తలలో వృద్ధి చేసుకోవలసియున్నది, కావున మానవాకారములోనున్న శంకరుడు కూడా తన తలమీద అభివృద్ధి చెందుచున్న జ్ఞానమునకు చిహ్నముగా చంద్రవంకను ధరించి చూపించాడు. ఈ విధముగా చంద్రుడు జ్ఞానమునకు గుర్తుగా ఉన్నాడు. జ్యోతిష్యశాస్త్రములో కూడా చంద్రగ్రహమును జ్ఞాన చిహ్నముగానే ఉంచారు. ఇదే ఆధారముతో జ్ఞానముగల దేశమును ఇందూదేశము అన్నారు. సృష్ఠి ఆదిలో రెండవ దినము మనిషికి జ్ఞానము తెలిసినది, కావున ఆ రెండవ దినమును ఇందువారము లేక సోమవారము అంటున్నాము. ఇందూ దేశములో ఇందువారము ఇందువులకు జ్ఞానరీత్యా ఎంతో ముఖ్యమైనది. అందువలన ఇందువారమైన సోమవారమును పూర్వమునుండి జ్ఞానవృద్ధి దినముగా పరిగణించెడివారు. కాలక్రమమున జ్ఞానము తెలియని వారి మధ్యలో సోమవారము జ్ఞానమునకు గుర్తని కూడా తెలియకుండా పోయినది.

ఇందూదేశమైన భారతదేశములోనే ఇందూత్వము (జ్ఞానము) తెలియని ఇందువులు చివరకు మనము పూర్వమునుండి ఇందువులమని పేరుగాంచియున్నామని తెలియక చివరకు మూన్‌డే, మన్‌డే అయినట్లు ఇందువులు హిందువులుగా చెప్పుకొంటున్నారు. జ్యోతిష్యశాస్త్రములో జాపతకము అను పదములో జా ప్రక్కనున్న "ప" అను అక్షరముపోయి జాతకము అయినట్లు ఇతర దేశములలో ఇంగ్లీషు భాషలో రెండవ దినమైన చంద్రుని దినమును పూర్వమునుండి MOON DAY (మూన్‌డే) అని పిలుచువారు యమ్ ప్రక్కన గల రెండు సున్నాలలో ఒక సున్నాను మరచి పోయి MON DAY (మన్‌డే) అని పిలుచుచున్నారు. ఇతర దేశములలో ఒక సున్నను మరచిపోతే భారతదేశములో ఏకంగా ఒక అక్షర స్వరూపమునే మార్చి "ఇ" ను "హి" గా చేసి ఇందూ దేశమును హిందూదేశము

అంటున్నారు. పూర్వము మనము జ్ఞానముగల ఇందువులమని చెప్పినా వినని హిందువులు నేడు దైవభక్తులు కాకుండా దేశభక్తులుగా ఉంటూ సత్యమును చెప్పిన మాలాంటి వారిని కూడా లెక్కచేయకున్నారు.

జ్ఞానములో అన్ని దేశములకు మిన్నగాయుండి ఇతర దేశములచేత ఇందూదేశమని పిలిపించుకొన్న ఈ దేశమునకు పూర్వవైభవము రావాలంటే మనమందరము జ్ఞానమును తెలిసిన ఇందువులుగా మారాలి. అలా మారాలంటే జ్ఞానమునకు ప్రతీకగాయున్న సోమవారమును గురించి తెలుసు కోవాలి. మొదటి రోజు సృష్ఠి ఆదికి చిహ్నముకాగా, రెండవరోజు దైవధర్మమును తెలుపు జ్ఞానమునకు గుర్తని తెలియాలి. జీవితములో మూడు రోజులే ముఖ్యమైనవి. ఒకటి పుట్టుక, రెండు బ్రతుకుట, మూడు చచ్చుట. ఈ మూడు దినములకు గుర్తుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను చెప్పారు. జ్ఞానమునకు అధిపతి చంద్రుడైనట్లు, పుట్టుకకు బ్రహ్మ, బ్రతుకుటకు విష్ణువు, చావుకు హరుడు అధిపతులని చెప్పారు. ముఖ్యమైన మూడు రోజులు వారములో మొదటనే గలవు. అందులో రెండవది ఇందువారము (సోమవారము). కాలగమనములో ఆదివారమున వచ్చు అమావాస్య ఎంత ముఖ్యమైనదో అలాగే సోమవారమున వచ్చు పౌర్ణమి కూడా అంతే ముఖ్యమైనది. ఆదివారమున వచ్చు అమావాస్య శక్తివంతమైనట్లు, సోమ వారమున వచ్చు పౌర్ణమి కూడ శక్తివంతమైనదే !

## మంగళవారము

మంగళము అనగా శుభకరమని అర్థము. ప్రపంచములో అన్నిటి కంటే శుభమైనది ఏది? అని ప్రశ్నించుకొని చూస్తే అన్నిటికంటే మించి అత్యంత శుభకరమైనది దైవము ఒక్కటే. దైవమును కాలము అని కూడా

అంటాము. కాలము అనగా నాశనమని కూడా అర్థము గలదు. దీని ప్రకారము చివరకు మంగళము అంటే నాశనమని కూడా చెప్పుకోవచ్చును. ఆధ్యాత్మికరీత్యా అలాగే చెప్పుకోవలసియున్నది. మంగళవారము అంటే నాశనదినము అని అర్థము. **ఆదివారము సృష్టికీ, సోమవారము స్థితికీ, మంగళవారము లయకు గుర్తుగా** పూర్వము నుండి పెద్దలు చెప్పుచునే ఉన్నారు. ఇక్కడ కొంత అనుమానము వచ్చి "సృష్టి, స్థితి, లయ అను మూడూ, మూడు దినములకు గుర్తయితే, లయ(నాశనము)కు సంబంధించిన దినమును శుభకరమైనదిగా మంగళ వారమని పేరు పెట్టారుగా, నాశనము ఎవరికైనా బాధతో కూడుకొని ఉంటుంది, కానీ శుభముతో కూడుకొని ఉంటుందా?" అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! నాశనము యొక్క నిజస్థితిని తెలియక గుణ ప్రభావమువలన చాలామంది బాధపడుచుండవచ్చును. కానీ నాశనమునకు అర్థమును తెలిస్తే ఎవరూ బాధపడరు. ఉదాహరణకు ఒకడు మరణిస్తే అతను నీకు దగ్గర సంబంధీకుడు కాబట్టి నీవు బాధపడ వచ్చును. చనిపోయినవాడు నాశనము కాలేదు, వాడు కేవలము రూపాంతరము చెందాడు. వాస్తవానికి వాడు నాశనము కాలేదు. అటువంటివానిని గూర్చి బాధపడడమును చూస్తే ఆ బాధ నాశనము గురించి కాదు, మరణమును గురించి మాత్రమే. ఈ విధముగా చూస్తే నిజానికి ఎవడు కూడా నాశనమునకు బాధపడడము లేదు. ఆకారమార్పుకే బాధపడుచున్నాడు. జీవమున్నవి కానీ, జీవములేనివి కానీ మార్పు చెందినపుడు ఆ మార్పును నాశనము అనుకోకూడదు. ప్రపంచములో ఏదైనా, ఎవరైనా మార్పు చెందుచున్నారే గానీ నాశనము చెందడములేదు. మార్పు ఎల్లప్పుడూ జరుగుతూ ఉంటుంది. నాశనము బహు అరుదుగా జరుగుతుంది. నాశనము కేవలము జీవరాసులకు సంబంధించినదే కానీ జీవములేని వాటికి సంబంధించినది కాదు. ఒక

జీవుడు ఎప్పటికైనా నాశనము చెందవచ్చును, కానీ ఒక వస్తువు ఎప్పటికీ నాశనము చెందదు.

ముఖ్యమైన సమస్య ఏమిటంటే నాశనము ఏది అను విషయము, చాలామంది మేధావులకు కూడా తెలియదు. మార్పును లేక మరణాన్ని నాశనము అని సర్వసాధారణముగా అందరూ అనుకొంటున్నాము. కానీ అది కేవలము ఒక మార్పేగానీ నాశనముకాదని గుర్తించలేక పోతున్నాము. ఉదాహరణకు ఒక కట్టె కాలి బొగ్గుకావచ్చు, బూడిదకావచ్చు. అంత మాత్రమున దానిని కట్టె నాశనమైంది అనకూడదు. కట్టె బొగ్గుగా మార్పు చెందింది అనవచ్చును. బూడిదైతే బూడిదగా మార్పుచెందింది అనవచ్చును. తుమ్మకట్టెను కాల్చి బూడిద చేస్తే దానిని తుమ్మకట్టె బూడిద అంటాము. ఎందుకంటే తుమ్మకట్టె బూడిదలో కొన్ని ప్రత్యేకతలుంటాయి. తుమ్మకట్టె ఎటువంటి స్థితిలోను లేకుండా పోయినపుడు అది నాశనమైంది అనవచ్చును. అట్లు ఏ వస్తువు నాశనము చెందదు. కేవలము శరీరమును ధరించిన జీవుడు మాత్రము నాశనము కాగలడు. జీవుడు నాశనము కొరకు యోగముతో ఎంతో శ్రమిస్తేగానీ, ఎంతో ఆరాటపడితేగానీ అరుదుగా నాశనము చెందుటకు అవకాశముగలదు. జీవుడు కోరుకుంటేనే ఎంతో కాలమునకు అరుదుగా లభించు నాశనమును గురించి యోచిస్తే అది ఎంతో గొప్పది, పవిత్రమైనది, శుభకరమైనదని తెలియుచున్నది. అందువలన నాశనమంటే కాలము, కాలమంటే దైవము, దైవమంటే శుభము లేక మంగళమని చెప్పవచ్చును. జీవుడు నాశనము చెందు దినమునకు మంగళవారమని పేరు పెట్టాము.

ఆధ్యాత్మిక జ్ఞానము తెలిసినవారికి మాత్రమే ఆది,సోమ,మంగళ వారముల విశిష్ఠత తెలియును. గ్రుడ్డివానికి రత్నమిచ్చినా దానిని కేవలము

సాధారణ రాయిగా లెక్కించుకొన్నట్లు ఆత్మజ్ఞానము లేనివానికి ఆది, సోమ, మంగళ వారములు కేవలము సాధారణ దినములుగా కనిపించుచున్నవి. జ్ఞానము ప్రకారము ఆది, సోమవారములను గురించి ముందు చెప్పుకొన్నాము. ఇపుడు మంగళవారమును గురించి వివరముగా చెప్పుకొందాము. సూర్య కుటుంబములోని గ్రహములు తొమ్మిదని చాలామంది చెప్పుకొనుచుందురు. ఆ మాట తప్పని, సులభముగా చెప్పవచ్చును. అదెలా అనగా! ఇక్కడ ఒక చిన్న ఉదాహరణను చెప్పు కొందాము. పరమానందయ్య శిష్యులు పదిమంది అనుకొందాము. పదిమంది నదిలోనికి స్నానానికి దిగి బయటకు వచ్చిన తర్వాత అందరూ బయటికి వచ్చారో లేదోనని వారిని వారు లెక్క పెట్టుకొన్నారట. నదిలోనికి దిగినది పదిమంది, తిరిగి బయటికి వచ్చినది పదిమందే! అయినా ఒకడు తగ్గిపోయినట్లు, తొమ్మిదిమందే ఉన్నట్లు లెక్కించుకొన్నారు. అక్కడ జరిగిన పొరపాటు ఏమనగా! లెక్కించువాడు తనను వదలి ఎదురుగా ఉన్నవారిని మాత్రము లెక్కించడము వలన ఒకరు తక్కువైనట్లు కనిపించినది. అలాగే సూర్య కుటుంబములో భూమి కూడా ఒక గ్రహముగా ఉన్ననూ భూమిని లెక్కించక ఇతర గ్రహములను లెక్కించడము వలన తొమ్మిది గ్రహములుగా తెలియుచున్నవి. వాస్తవానికి భూమితో సహా లెక్కించితే గ్రహములు పది అని తెలియుచున్నది. పరమానందయ్య శిష్యులు పదిమంది అయినా చివరకు వారు తొమ్మిది మందేయున్నట్లు, ఒకడు నీటిలో కొట్టుకుపోయినట్లు బాధపడుచున్నపుడు, ప్రక్క మనిషి వచ్చి అందరినీ కలిపి లెక్కించి పదిమంది యున్నట్లు తేల్చి చెప్పినట్లు, చివరకు మనకు కూడా ప్రక్క మనిషి కథ చెప్పి వివరిస్తేగానీ గ్రహములు పదియని తెలియకుండా పోయినది. ఇంకా వివరించుకొని చూస్తే గ్రహములు తొమ్మిది కాదు మొత్తము పండ్రెండని తెలియగలదు. ఇక్కడ వాటిని గురించి చెప్పడము సందర్భము కాదు.

అందువలన **"జ్యోతిష్యశాస్త్రము"** అను గ్రంథములో వాటి వివరము అందించగలము. ఇక్కడ సూర్యకుటుంబములో గ్రహముల సంఖ్య తొమ్మిదను మాట తప్పనుటకు మాత్రమే ఈ వివరము చెప్పాల్సి వచ్చినది.

కుటుంబము అనగా కొందరు ఒక గుంపుగా కలిసి సమిష్ఠిగా పని చేయడమును కుటుంబము అంటున్నాము. **"కుంటుంబము"** అను పదము "కుటుంబముగా" చెప్పబడుచున్నదని కూడా **"సుబోధ"** గ్రంథములో **"నీ సంసారము"** అను వ్యాసములో చెప్పాము. ఒక దేశములో ఎన్నో కుటుంబములు ఉన్ననూ, ఆ దేశములోని కుటుంబములన్నీ ప్రభుత్వము యొక్క ఆధీనములోనే ఉండును. ప్రభుత్వము ప్రభువు చేతిలో ఉండును. ప్రభుత్వములోని చట్టమునకు లోబడి దేశములోని అన్ని కుటుంబములు ఉండును. ఎవరూ చట్టమును అతిక్రమించకూడదు. అలాగే విశ్వములోని ఎన్నో గ్రహ కుటుంబములున్నవి. దేశములో కుటుంబములన్నిటికీ ప్రభువు ప్రభుత్వము పెద్దగాయున్నట్లు, విశ్వములోని గ్రహ కుటుంబములకు కూడ ఒక ప్రభువు, ప్రభుత్వము కలదు. దానిని **'దైవము, దైవత్వము'** అంటున్నాము. మనుష్యకుటుంబములు ప్రభుత్వ ఆధీనములో ఉన్నట్లు, గ్రహకుటుంబములు దైవత్వ ఆధీనములో ఉన్నవి. దేశములోని అన్ని కుటుంబములకు ప్రభువు (రాజు) పెద్ద అయినట్లు, విశ్వములోని అన్ని గ్రహకుటుంబములకు పెద్ద దైవము ఒక్కడేనని తెలియవలెను. దేశములో ప్రభువు స్వతంత్రుడై ఎవరి ఆధీనములో లేనట్లు, విశ్వములోని దైవము కూడా సర్వ స్వతంత్రుడై ఎవరి ఆధీనములో ఉండదు. **'ఛత్రము'** అనగా గొడుగు అని అందరికీ తెలుసు. ఛత్రము ఎండకు వానకు రక్షణ నివ్వగలదు. దేవుడు ఎవరి రక్షణలో లేనివాడు గనుక దైవమును **"నఛత్రుడు"** అంటున్నాము. నఛత్రుడైన దైవమునకు గుర్తుగా ఆకాశములో నక్షత్రము గలదు. వాస్తవానికి నక్షత్రము అను పదము పూర్వము "నఛత్రము" అను పదముగా ఉండెడిది. కాలక్రమున

చివరకు **నఛత్రము అను శబ్దము నక్షత్రమను శబ్దముగా** మారిపోయినది. నక్షత్రము దైవమునకు గుర్తని కొంత వివరము తెలిసినదికదా! ప్రపంచము లోని ఎన్నో దేశములకు ఎందరో రాజు (ప్రభువు) లున్నట్లు, విశ్వములోని ఎన్నో సూర్య కుటుంబములకు పెద్దగా ఎన్నో నక్షత్రములు ఉన్నవని బాహ్యార్థముగా కనిపించుచున్నవి. **ప్రభువు అంటే రాజు అన్నట్లు నక్షత్రము అంటే దేవుడని తెలియవలెను.** దేవుడు శుభకరమైనవాడు గనుక అతనిని మంగళుడు అంటున్నాము. ఉరిశిక్షపడిన వానికైనా దేశానికి ప్రెసిడెంట్ (ప్రభువు) అయినవాడు ఒక సంతకము చేస్తే శిక్ష మొత్తము రద్దయిపోగలదు. అలాగే కర్మ శిక్షపడిన వానిని విశ్వాధిపతియైన దేవుడు సమ్మతిస్తే వాడు శిక్షనుండి విడుదల పొందగలడు. **కర్మ శిక్షనుండి జీవుని విడుదలనే ముక్తి లేక మోక్షము** అంటున్నాము. అందువలన దేవున్ని **ముక్తిదాత లేక మోక్షదాత** అంటున్నాము. జీవుడు నాశనమైనపుడే ముక్తి పొందగలడు. అందువలన దైవమును **కాలుడు** అని అంటున్నాము. అలాగే **మంగళుడు** అని అంటున్నాము. మంగళకరమైన దైవమునకు గుర్తుగా వారారంభమున మూడవ దినమును **మంగళవారమని** అంటున్నాము. ఇంతవరకు చెప్పుకొన్న దానినిబట్టి మంగళవారమునకు గల కొంత వివరమును తెలుసుకొన్నాము.

ఆదిలో "రామ" అను పదమును దైవమునకు ఉపయోగించెడివారు. దశరథరాముడు పుట్టక పూర్వమే "మరా" అన్న శబ్దమునుండి 'రామ' అను శబ్దము పుట్టినది. రామ అనినా మరా అనినా రెండూ ఒకే అర్థము నిచ్చుచున్నవి. దైవమునకు మారు పేరైన రామా శబ్దమును దశరథపుత్రునికి పెట్టడము జరిగినది. త్రేతాయుగమునుండి దశరథరామ పేరు వాడుకలోనికి రాగ, కృతయుగమునుండియున్న **"ఆత్మారామ"** శబ్దము మరుగున పడిపోయి నది. రామ అంటే దశరథ రాముడే అని అందరికీ తెలుసు. అదే విధముగా మంగళ అను పేరు దైవమునకు సంబంధించినదికాగా, అది మరుగున

పడిపోయి చివరకు కుజగ్రహమునకు మంగళుడని పేరు వచ్చినది. కుజ గ్రహమునకు మంగళ అను పేరుండుట వలన ఆ పేరు దైవానిదని తెలియకుండా పోయినది. అందువలన మంగళ అన్నప్పుడు దానికి సమానమైన అర్థమునిచ్చు నక్షత్రమును ఎవరూ గుర్తించక కుజగ్రహమునే జ్ఞప్తి చేసుకొంటున్నారు. రామ శబ్దము దశరథ పుత్రునికి అంటుకొని దశరథరామున్ని జ్ఞప్తికి తెచ్చినట్లు, మంగళ శబ్దము కుజగ్రహమునకు అంటుకొనిపోయి కుజగ్రహమునే జ్ఞప్తికి తెచ్చుచున్నది. అందువలన కొందరు ఆది, సోమ, మంగళవారములకు అధిపతులు సూర్య, చంద్ర, కుజగ్రహములని అంటున్నారు. వాస్తవానికి ఆది, సోమ, మంగళవారములకు అధిపతులుగా సూర్య,చంద్ర,నక్షత్రములను చెప్పవలసియున్నది. జీవాత్మ, ఆత్మ రెండూ శరీరములో ఉండగా ఆత్మకంటే పరముగానున్న పరమాత్మ ఎలా శరీరములోనున్నదో, అలాగే సూర్య,చంద్ర రెండు గ్రహములు ఆకాశములో ఉండగా గ్రహముకంటే వేరుగాయున్న గ్రహము అని పేరు లేని నక్షత్రము ఆకాశములోనే ఉన్నది. సూర్య చంద్రులకంటే అతీతమైన నక్షత్రము గ్రహము కాకపోయినా, 'మంగళ' అను బిరుదు నక్షత్రమునకు ఉండగా కుజగ్రహము మంగళుడని పేరు కల్గియుండడము వలన చివరకు నక్షత్రము స్థానములో కుజగ్రహము నిలిచి పోయినది. ఆత్మజ్ఞానము ప్రకారము మంగళ అనగా కుజగ్రహము కాదని నక్షత్రమని తెలియవలెను. దీనిప్రకారము దేవునికి గుర్తుగా నక్షత్రమునూ, నక్షత్రదినముగా మంగళ వారమును లెక్కించవలసియున్నది. సూర్య,చంద్ర,నక్షత్రములలో సూర్య చంద్రులను గ్రహములనుచున్నాము నక్షత్రమును గ్రహము అనుటకు వీలులేదు. సూర్యున్ని సూర్యగ్రహము అనవచ్చును, చంద్రున్ని చంద్రగ్రహము అనవచ్చును, కానీ నక్షత్రమును నక్షత్రగ్రహము అని అనలేము. అలాగే శరీరములోని ఏ ఆత్మ కానిది పరమాత్మ అని చెప్పవచ్చును.

ఆదివారము సృష్టి విషయమును తెల్పునదై ఉండగా, సోమవారము దేవుని జ్ఞాన విషయము తెల్పునదై ఉండగా, మూడవదయిన మంగళ వారము ఏకముగ పరమాత్మను, పరంధామమును, మోక్షమును తెల్పునదై ఉన్నది. ఆదివారమునకు సూర్యుడు, సోమవారమునకు చంద్రుడు ముఖ్యులు కాగా మంగళవారమునకు నక్షత్రము ముఖ్యముగా ఉన్నది. సూర్యుడు ఆకాశములో పగలు కనిపించి రాత్రి ఉండడు. అలాగే చంద్రుడు రాత్రి కనిపించి పగలు కనిపించడు. సూర్యచంద్రులు ఆకాశములో కొంత సేపు కనిపించి కొంత సేపు కనిపించరు. జగత్తు ఉన్నంత వరకు మనిషికి పుట్టుక, జ్ఞానము అవసరము. జగత్తు ఉన్నంతవరకే గల పుట్టుక జ్ఞానములు జగత్తు ప్రళయము చెందినపుడు లేకుండా పోవును. జగత్తు ప్రభవము, ప్రళయములు చెందుచూ కొంత కాలముండి కొంత కాలము లేకుండా పోవుచున్నది. 108 కోట్ల సంవత్సరములున్న జగత్తు, 108 కోట్ల సంవత్సరములు లేకుండా పోవుచున్నది. ఆ సూత్రము ప్రకారమే ప్రపంచములో రాత్రింబవళ్ళు ఏర్పడినవి. ఈ సూత్రము ప్రకారమే మనిషి పుట్టుక జ్ఞానములు కొంత కాలముండి కొంత కాలముండవని తెల్పునట్లు, ఒక దినములో కొంత కాలము కనిపించి కొంత కాలము కనిపించని సూర్య చంద్రులను గుర్తింపుగ నుంచారు. పుట్టుక, జ్ఞానమును తెల్పు ఆది, సోమవారములకంటే మించినది మంగళవారము. మంగళవారము శాశ్వితముగా ఎప్పటికీ ఉండు దేవున్ని తెలియజేయునది. మంగళవారము, పుట్టుక జ్ఞానముల తర్వాత మోక్షము పొందవలెనని తెలియజేయు సందేశమిచ్చునదై ఉన్నది. జ్ఞానము ద్వారా లభించువాడు శాశ్వితమైన దేవుడు! దేవుడు అనంతుడు!! అన్నిటికంటే పెద్దవాడు!!! అందువలననే ఎల్లప్పుడూ ఆకాశములో ఉన్న నక్షత్రమును, సూర్య చంద్ర గోళములన్నిటికంటే కొన్ని లక్షల రెట్లు పెద్దగనున్న నక్షత్రమును దేవుని చిహ్నముగా చూపడము జరిగినది. లోతైన బావిలోనికి దిగి, అనగా

సూర్యరశ్మి లేకుండా చీకటిగనున్న లోతైన బావిలో నుండి ఆకాశము వైపు చూస్తే పగలు కూడా నక్షత్రములు కనిపించగలవు. నక్షత్రములు పగలు రాత్రి ఎప్పటికీ ఉండును. అన్ని సమయములలోనూ మనలను చూస్తున్న దేవున్ని అన్ని సమయములలోనూ మనమీద గల నక్షత్రముతో పోల్చి చెప్పడము గొప్ప విధానమే. మోక్షమును పొందడము దైవమును పొందినట్లే అగును. దైవమును ఫలానా అని చెప్పలేము. దేవుడు అన్నిటికీ అతీతమైనవాడు. అందువలన ఎటూ తేల్చి చెప్పలేక శుభప్రదమైనవాడని చెప్పాము. శుభప్రదమును మంగళమని చెప్పుచు మూడవ దినమును మంగళవారమని అన్నాము.

మనిషి జీవితములో ముఖ్యమైనవి మూడు ఘట్టములున్నవి. **ఒకటి పుట్టుక, రెండవది జీవించుట, మూడవది మరణించుట.** వీటినే ఆది, మధ్య అంత్యములంటున్నాము. ఆది, మధ్య, అంత్యములు గల అందరికీ ముఖ్యమైనవి ఆదివారము, సోమవారము, మంగళవారము. ఆదిని గూర్చి ఆదివారము (రవివారము), మధ్యను గూర్చి సోమవారము, అంత్యమును గూర్చి మంగళవారములు గుర్తించుకొన్నాము. అలాగే ఆది, మధ్య, అంత్యముల వివరమును తెల్పునవిగ సూర్యున్ని, చంద్రున్ని, నక్షత్రమును గుర్తించుకొన్నాము. ఈ విధముగా గుర్తించుకోవడము లేక తెలుసుకోవడము లేక ఇతరులకు తెలుపడము జ్ఞానమైతే దాని ప్రకారము ఆచరించడము ఆరాధన అవుతుంది. ఈ ఆరాధనలో నిన్ను నీవు గుర్తించుకొనుటకు దైవభావము పొందుటకు మంచి అవకాశముగలదు. పూర్వము కృతయుగములోనే మన పెద్దలు జ్ఞాన విధానముతో మనకు మంచి మార్గమును చూపారు. అందరికీ ఆధారమైనవాడు, అందరినీ సృష్ఠించినవాడు, సర్వమునకూ మూలమైనవాడు ఒకే దేవుడని తెలియునట్లు, అసలైన పరమాత్మను (ఖుదాను) వదలి ఇతరులను పూజించకుండునట్లు, మరి ఏ

ఇతర దేవతలను పూజించకుండునట్లు, ఏ దేవతలైనా అసలైన దేవుని (పరమాత్మ) చేతనే సృష్ఠింపబడ్డారని తెలియునట్లు, దేవుని చేత సృష్ఠించబడిన దేనినైనా దేవునితో సమానముగా చూడకుండునట్లు, మనిషి అసలైన జ్ఞానమార్గములో ప్రయాణించుటకు, మోక్షము పొంది దేవునిలో ఐక్యమగునట్లు ముఖ్యమైన ఆరాధనను ఏర్పరిచారు. పూర్వము సంపూర్ణ జ్ఞానులైన మన పెద్దలు ఏర్పరిచిన ఆరాధన క్రమము చాలా గొప్పది. త్రేతాయుగములోని వశిష్ట, విశ్వామిత్రులకంటే మరియు ద్వాపరయుగము లోని వ్యాసునికంటే గొప్పవారైన కృతయుగపు బ్రహ్మర్షులచేత చెప్పబడిన మరియు ఆచరింపబడిన ఆరాధనయే త్రైతారాధన. త్రైతారాధన వారములోని ఆది, సోమ, మంగళవారములు మాత్రము ఆచరింపబడునదై ఉన్నది. త్రైతారాధన అన్ని ఆరాధనలకంటే మించినదై దైవమునకు దగ్గరగా తీసుకుపోవునదై ఉన్నది. త్రైతారాధన గొప్ప అనుభూతితో కూడుకొన్నదై ఆరాధన సమయములో గొప్ప తృప్తిని ఏర్పరచుచున్నది.

త్రైతారాధన మూడు భాగములుగా ఉన్నది. ఆది ఆరాధన, మధ్య ఆరాధన, అంత్య ఆరాధన అని మూడు ఆరాధనలను కలిపి త్రైతారాధన అంటున్నాము. ముందు ఆది ఆరాధనను గురించి తెలుసుకొందాము.

## ఆది ఆరాధన

ఆది ఆరాధన ఆదివారము సూర్యోదయములోనే చేయవలెను. ఆది ఆరాధన సృష్ఠి విషయమును తెలియజేయునదై ఉండుట వలన మొదటి దినమైన ఆదివారమే చేయవలసి ఉన్నది. సూర్యోదయముతోనే సృష్ఠి మొదలైనది కావున సూర్యుడు పుట్టుచున్నపుడే మొదటి ఆరాధన జరుగవలెను. ఆది ఆరాధన మనిషి పుట్టుకను సూచించునది కావున గొప్ప విశేషమైన

భావముతో కూడుకొని ఉన్నది. ఆరాధన ఒక పద్ధతి ప్రకారము చేయవలసియున్నది. ఆది ఆరాధన పద్ధతి ప్రకారము ఆరాధన విషయము తెలిసిన భక్తులందరూ ఒకే స్థలములో కలిసి ప్రార్థన చేయవలసి ఉండును. ఆది ఆరాధనకు అందరూ కలియుట చేత సామూహిక ప్రార్థనగా ఉండును. ప్రయాణ సమయములలో గాని, ఒంటరిగా ఇతర ప్రదేశములలో ఉన్నపుడు గాని తానొక్కరు ఆరాధన చేసుకోవచ్చును. ఆరాధనకు శుభ్రత చాలా ముఖ్యము ఆరాధన చేయు స్థలము పరిశుభ్రముగా ఉండవలెను. సామూహిక ఆరాధన కొరకు ప్రత్యేకించి ఒక స్థలమును కేంద్రముగా చేసుకోవడము మంచిది. ప్రార్థనా స్థలశుభ్రతయే కాక శరీర శుభ్రత కూడా చాలా అవసరము. ప్రతి ఒక్కరూ స్నానము చేసి ప్రార్థనలో పాల్గొనవలెను. ఒకవేళ ఎప్పుడైనాగాని అనారోగ్య పరిస్థితుల వలన స్నానము చేయలేకపోతే తప్పనిసరిగా ముఖము, కాళ్ళు, చేతులు, చంకలు నీటితో శుభ్రము చేసుకోవలెను. ప్రయాణసమయములో స్నానము చేయలేకపోతే నీరు దొరకకపోతే చివరకు రెండు అరచేతులనయినా కడుగుకోవలెను. అరచేతి శుభ్రమునకు కూడా నీరు దొరకని పక్షములో ఫేస్‌పౌడర్‌ను అరచేతులకు, ముఖమునకు, చంకలకు అద్దుకొని ప్రార్థన చేయవచ్చును. ఆది ప్రార్థనకు ఐదు సంవత్సరముల పిల్లలతో పాటు కుటుంబ సభ్యులందరూ పాల్గొన వచ్చును. కుటుంబ సభ్యులకు ఆది ప్రార్థన సారాంశమును తెలియజేసి వారిని పాల్గొనునట్లు చేయవలెను. ప్రార్థనలో పాల్గొను స్త్రీలను ప్రత్యేక వరుసలో కూర్చుండబెట్టవలయును. సర్వులను సృష్టించిన సృష్టికర్తయైన దేవుని గురించిన మతాతీత ఆరాధన కావున ఏ మతస్థులయినా ఈ ప్రార్థనలో పాల్గొనవచ్చును. త్రైతారాధన పవిత్రమైనది కావున ప్రార్థన దినములలో తప్పనిసరిగా దురభ్యాసములకు దూరముగా ఉండవలెను. త్రైత సిద్ధాంతమును తెలిసిన ప్రబోధ సేవా సమితి సభ్యులు విధిగా త్రైతారాధన చేయవలసి

యుండును. ఒకవేళ అనివార్య కారణముల వలన గాని, అనారోగ్య కారణముల వలన గాని ఆది ప్రార్థన చేయలేని సందర్భములో తర్వాత మిగతా సమయములో గాని ప్రార్థన విధిగా చేయవలెను. సభ్యులు ప్రార్థనా సమయమునకు కనీసము ఐదు నిమిషములు ముందు ఆరాధన స్థలమునకు చేరి ఉండవలెను. ప్రార్థనకు వచ్చిన ప్రతి ఒక్కరిని పలుకరించడము సభ్యులు విధిగా చేయవలెను. పలకరింపు చేతుల జోడించిన నమస్కారముతో ఉండవలెను. నమస్కారము దేవునికి ఇద్దరము సమానమని తెల్పు ఉద్దేశముతో ఉండవలెను. ప్రార్థన స్థలమున శత్రువుకయినా తప్పనిసరిగా నమస్కారము చెప్పవలెను. ప్రతి సభ్యుడు త్రైతారాధన వివరము అర్థము తెలిసినవాడై వాటి ప్రత్యేకతను ఇతరులకు చెప్పు స్థోమత కలిగి ఉండవలెను.

ఆది ఆరాధన చేయు సమయములో తూర్పువైపుకి తిరిగి కూర్చొనవలెను. సూర్యుడు తూర్పువైపున పుట్టుచున్నాడు కావున మొదటి ఆరాధన తూర్పుదిశకే కూర్చొని చేయవలెను. శరీర అనుకూలతను బట్టి కూర్చోవడము మంచిది. సాధ్యమున్నంత వరకు అందరూ ఒకే ఆసనములో కూర్చోవడము శ్రేయస్కరము. అన్నిటికంటే ముఖ్యమైన విధానమేమంటే ప్రతి ఒక్కరు మూడు కోణములు గల తెల్లని గుడ్డను తలమీద కట్టుకోవలెను. గీతలో చెప్పినట్లు మూడుకోణముల వస్త్రము **త్రైత సిద్ధాంతమును** తెల్పునట్లు ఉండవలెను. తెల్లని గుడ్డ రెండుకొనలను తలమిాద నుంచి గడ్డము క్రింద కలిపి ముడివేసి ఒక కొనను తలవెనుకకు వదలివేయవలెను. ముఖము క్రింద ఎడమ ప్రక్కనుండి వచ్చినకొనను **జీవాత్మ** అని, కుడి ప్రక్కనుండి వచ్చినకొనను **ఆత్మ** అని తలచవలెను. గీతలో చెప్పినట్లు ఒకే శరీరములో జీవాత్మ ఆత్మలు కలిసి నివసిస్తున్నాయను అర్థము తెలియునట్లు రెండు కొనలను కలిపి కట్టవలెను. శరీరములో మూడవవాడైన **పరమాత్మను** గుడ్డ యొక్క మూడవకొనగా తలచవలెను. పరమాత్మ (దేవుడు) శరీరములో




అగోచరుడై ఎవరికీ తెలియకుండావున్నాడు కావున అదే అర్థమొచ్చునట్లు మూడవకొనను ముందరచూచు వారికి కనిపించకుండా తల వెనుకకుండునట్లు చేయవలెను. మూడుకొనల గుడ్డను రెండుకొనలు కలిపి గడ్డము క్రింద కట్టితే మూడవకొన యధావిధిగ వెనుకకే ఉండును. భగవద్గీతలో చెప్పినట్లు ఆత్మ జీవాత్మతో కూటస్థునిగ ఉన్నాడు అని తెలియునట్లు అర్థముతో రెండుకొనలు ముడివేయడము, మూడవ పరమాత్మ ఎవరికీ తెలియకుండా ఆత్మ జీవాత్మలకంటే అతీతునిగా ఉన్నాడని తెలియునట్లు అర్థముతో మూడవకొన వెనుక భాగములో నిలచిపోవడమును చూస్తే **త్రైత సిద్ధాంతము** పూర్తి కనిపిస్తున్నది. **జీవాత్మ (క్షరుడు), ఆత్మ (అక్షరుడు), పరమాత్మ (పురుషోత్తముడు)** ఉనికిని తెలియజేయు నిమిత్తము తలమీదనే గుడ్డను కట్టవలెను. ఆత్మలను తెలియజేయు చిహ్నముగా మూడుకొనల గుడ్డను వాడుచున్నాము కావున ఆత్మల స్వచ్ఛతను తెలియజేయునట్లు తెల్లని వస్త్రమును వాడవలెను.

తెల్లని వస్త్రము తలమీద కట్టుకొని **సూర్యోదయమునకు ఐదు నిమిషముల ముందు ప్రార్థనలో కూర్చోవలెను. సూర్యుడు ఉదయించునపుడు ప్రార్థనలో ఉండవలెననుట అది ప్రార్థన యొక్క నియమము.** సూర్యోదయము

తర్వాత ఐదు నిమిషములు ప్రార్థనలో ఉంటు ప్రార్థనకాలము పది నిమిషములుండునట్లు చూచుకోవలెను. ప్రార్థన సమయములో ఎడమ చేయి హస్తమును గడ్డము క్రింద ఆనించి పెట్టుకోవలెను. అలాగే కుడిచేయి హస్తమును తల మీద ఆనించి పెట్టుకోవలెను. అట్లుంచుకోవడము వలన ధ్యాస అంతయూ తల మధ్యలో ఏర్పడును. పైన క్రింద చేతులుంచుకొని కళ్ళు మూసుకొని కూర్చోవడము వలన మనోదృష్ఠి తల మధ్య భాగములో చేరుటకు అవకాశమున్నది. ఆదివారము సూర్యోదయము చేయు ప్రార్థన సృష్ఠి మొదలును తెలియజేయునదే కాక, నీ పుట్టుకను జ్ఞాపకము చేయుచున్నది. అప్పుడే పుట్టినవానికి, వాని తలలో ఏ గుణములు లేకుండును. పుట్టిన శిశువుకు ఏ గుణములుండవు కావున శిశువును దేవునితో సమానముగా కొందరు వర్ణించారు. ఆది ఆరాధనలో, సూర్యోదయముతో శిశువు పుట్టుక సమానమైనందు వలన, ఆ సమయములో శిశువు తలలో గుణములు లేనట్లు ఆరాధకుని తలలో కూడా ఏ గుణ సంకల్పము లేకుండా ఉండవలెను. ఆ పది నిమిషములు అట్లుండుటకు ప్రయత్నము చేయవలెను. పుట్టిన శిశువుతో సమానముగా ఉండు ఆరాధన కావున ఇది భగవద్గీతలో చెప్పిన బ్రహ్మయోగ సాధన అగును. త్రైతారాధన క్రమములో మొదటిదయిన ఆది ప్రార్థన మొదటి దినమైన ఆదివారమే చేయడముకాక బ్రహ్మ, కర్మ, భక్తి యోగమను మూడు యోగపద్ధతులలో మొదటిదయిన బ్రహ్మయోగమును ఆచరించినట్లగుచున్నది. సామూహిక ప్రార్థన కావున అందరూ ఒకేమారు మొదలుపెట్టి ఒకేమారు ముగించుటకు మరియు అందరూ పది నిమిషముల వరకే ప్రార్థన చేయుటకు అనుకూలముగా ఉండునట్లు పూర్వము దేవుని బీజాక్షరమైన **"ఓం"** కారనాదముతో ప్రారంభించి చివరిలో అదే నాదముతో ముగించెడివారు. ఉదయము ఆది ప్రార్థన తర్వాత ఎవరి పనులు వారు చేసుకొనవచ్చును.

ఈ విధముగా ఎంతో సారాంశమైన, ఆచరణతోనున్న ఆది ప్రార్థన కాలగర్భములో కలిసిపోయినది. తిరిగి దానిని పునరుద్ధరించి పూర్వపు ఆచారమునకు అందరము కలిసి ప్రాణము పోద్దాము.

## మధ్యారాధన

మధ్యారాధన మధ్యాహ్నము సరిగా పన్నెండు గంటల సమయము లో సూర్యుడు నడి నెత్తినున్నపుడు చేయవలెను. ఆది ప్రార్థనలో తూర్పుకు తిరిగి కూర్చొనగా, మధ్య ప్రార్థనలో దక్షిణ దిశకు తిరిగి కూర్చొనవలయును. మొదటి ప్రార్థనలోనున్నట్లే మధ్య ప్రార్థనలో కూడా తలమీద గుడ్డ కట్టుకోవడము చేతులు పెట్టుకోవడము చేయవలెను. మధ్యప్రార్థన రెండవ రోజైన సోమవారము చేయవలెను. సోమవారము దైవజ్ఞానమునకు సంబంధించిన దినము కావున ప్రార్థనకాలములో తలలో జ్ఞానము యొక్క జ్ఞప్తికల్గి తనకు సంభవించు ప్రతిదీ, తనచేత చేయబడు ప్రతిదీ, తాను అనుభవించు ప్రతిదీ కర్మ నిర్ణయము ప్రకారము జరుగుచున్నదని తన ప్రమేయమేదీ లేదని తలపోయుచుండవలెను. ప్రార్థనాసమయము కూడా పది నిమిషములుండునట్లే చూచుకోవలెను. ఆది ప్రార్థన మొదలు పెట్టినట్లు అందరు 'ఓం' శబ్దముతో మొదలు పెట్టి 'ఓం' శబ్దముతో ముగించవలెను. ఓం శబ్దమును మొదట చెప్పుటకు మరియు ప్రార్థన చివరిలో చెప్పుటకు ముందే ఒకరిని నిర్ణయించుకొని ఉండవలెను. మధ్యప్రార్థన మధ్యాహ్నమే చేయవలెను. అనివార్యకారణముల వలన గాని, ఆరోగ్యరీత్య ఆ సమయానికి చేయలేకపోతే ఇతర సమయములో గాని తప్పనిసరిగా చేయవలెను. సోమవార ప్రార్థనకు కూడా ఆదివార ప్రార్థనపట్ల శుభ్రముగనున్నట్లే ఉండవలెను. సోమవార మధ్య ప్రార్థనలో దిశా, భావము తప్ప అన్నీ ఆది ప్రార్థనకు పాటించినట్లే పాటించవలెను.

మధ్యప్రార్థన జీవిత జ్ఞానమునకు సంబంధించినది కావున ప్రపంచములో పాత్రధారుడై నడుచుకొను ప్రతి మనిషి తనను నడిపించు సూత్రము కర్మయని, కర్మసూత్రము కదలించునట్లు కదలుచున్నానని స్వయముగ తాను కదలు స్వతంత్రుడనుకానని జ్ఞానము కల్గియుండునట్లు మధ్య ప్రార్థన ఏర్పరచబడివున్నది. మధ్య ప్రార్థనలో తాను కర్మబద్ధుడననీ, ప్రతి పని నేను చేయునది కాదు నా చేత చేయించబడుచున్నదనీ, నాచేత జరుగబడు కార్యము నేను చేయడము లేదని యోచించడము వలన మనిషి జీవితములో కూడా అదే జ్ఞానము జ్ఞాపకముండి, ఏ కర్మనూ అంటించు కోవడము జరుగదు. మధ్య ప్రార్థన అహము లేని విధానమును అలవాటు చేయుచున్నది. ఈ అలవాటును భగవద్గీతలో చెప్పిన రెండవదైన కర్మయోగము అని తెలియవలెను. పుట్టింది మొదలు ప్రతి మనిషి చావు వైపు ప్రయాణిస్తున్నాడు. జన్మనుండి ప్రతి మనిషి యొక్క జీవితము మరణము వైపుకు సాగుచున్నది. మరణమునకు అధిపతి పరమాత్మయని, అతడే యముడని అతని దిశ దక్షిణమని చెప్పుకొన్నట్లు శరీరములో జీవాత్మ కుడి ప్రక్క కాల ద్వారముల ద్వారానే మోక్షము పొందవలసి ఉన్నది. జీవునికి మరణము గాని, మోక్షము గాని కాలచక్రములోని కుడి ప్రక్క ద్వారముల ద్వారానే జరుగుచున్నది. ఈ విషయము మాచే రచింపబడిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో అక్షరపరబ్రహ్మయోగమను అధ్యాయములోనూ మరియు **"ప్రబోధ"** గ్రంథములో "బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు" అను వ్యాసము లోనూ విపులముగా చెప్పబడినది. జీవిత ప్రయాణము మరణము లేక మోక్షము వైపుకు కావున వాటి ద్వారములు కుడిప్రక్కనున్నందు వలన ఆదివారము తూర్పువైపుకు కూర్చున్నవారు రెండవ రోజు సోమవారము కుడిచేతి వైపు తిరిగి దక్షిణమువైపు కూర్చోవలసి ఉన్నది. మధ్యారాధన సోమవారమునది కావున జ్ఞానము యొక్క జ్ఞప్తి కల్గియుండడము, జ్ఞాన

గమ్యము కుడివైపు కావున దక్షిణదిశకు తిరిగి కూర్చోవడము ప్రత్యేకత. సోమవారము యొక్క ఆరాధన వివరము తెలిసి ఆచరించు వ్యక్తి తర్వాత అదే జ్ఞప్తితో కర్మయోగమును ఆచరించగలడు. జీవితములో కర్మయోగ ఆచరణ అలవరచుకోవడము ద్వారా మనిషి భగవద్గీతలో దేవుడు చెప్పినట్లు **యజ్ఞకర్మ** ఆచరించినట్లగును. యజ్ఞకర్మ అనగా రాబోవు కర్మను కాల్చివేయడ మని అర్థము. కర్మను అంటని విధానము సోమవారము ఆచరించెడి మధ్యారాధన వలన సాధ్యమై మనిషి మోక్షమును పొందవచ్చును. ఆదివారము చేయు సూర్యోదయ ప్రార్థనలో బ్రహ్మయోగము, సోమవారము మధ్యాహ్నము చేయు మధ్య ప్రార్థనలో కర్మయోగము అలవాటగును. త్రైతారాధనలో భాగములైన ఆది, సోమవారముల ప్రార్థనలో ఇంత విశేషముండగ మూడవ ప్రార్థన ఏమిటో తెలుసుకొందాము.

## అంత్యారాధన

ఆది ప్రార్థన వారములో మొదటిదైన ఆదివారము చేయగా, మధ్యప్రార్థన వారములో రెండవ దినమైన సోమవారము చేయగా, అంత్యప్రార్థన వారములో మూడవ దినమైన మంగళవారము చేయబడు చున్నది. ఆదివారము జీవుని పుట్టుకను, సోమవారము జీవితములో దైవజ్ఞానమును తెలుపగా మంగళవారము సరాసరి మోక్షమునే తెలియజేయు చున్నది. శుభప్రదమైన మోక్షమును తెలియు ఆరాధన మూడవ దినమైన మంగళప్రదమైన మంగళవారము చేయబడుచున్నది. మంగళవారము చేయు అంత్య ఆరాధనతో మొత్తము త్రైతారాధనలు పూర్తి అగుచున్నవి. త్రైతారాధనలో చివరిదైన అంత్యారాధన కూడా తెల్లని గుడ్డను తలమీద ధరించి, చేతులు తలమీద, క్రింద పెట్టుకొని ఆది, మధ్య ఆరాధనలలాగే చేయవలసివుండును. చివరిదైన అంత్యారాధన మంగళవారము

సూర్యాస్తమయములో చేయవలెను. **సూర్యుడు అస్తమించక ముందు ఐదు నిమిషములపుడు ప్రారంభించి, అస్తమించిన తర్వాత ఐదు నిమిషములుండునట్లు చేయవలెను.** మొత్తము పది నిమిషముల ప్రార్థనసమయములో మిగతా ప్రార్థనలలాగే గుడ్డ, చేతులుండగా కూర్చున్న దిశ, తలలోని ఉద్దేశ్యము వేరుగావుండును. మంగళవారము సూర్యాస్తమయములో చేయు ప్రార్థన పడమటి దిశ వైపుకు తిరిగి చేయవలెను. ప్రార్థనసమయములో భగవద్గీతలో చెప్పిన భక్తియోగమును ధ్యాసలోనికి తెచ్చుకోవలెను. ప్రపంచమునకు అంతటికీ దేవుడైన పురుషోత్తముడే పెద్ద అనీ, పరమాత్మమీదకంటే అన్యదా ఎవరిమీద విధేయత లేదనీ, దేవుని మీద ఉన్న భక్తియే దేవుని అంశయైన భగవంతుని మీద కూడా ఉన్నదనీ, సృష్టికర్త, పరలోక రాజ్యాధిపతియైన పరమాత్మయే సర్వలోక శాసనుడనీ, ఆది మధ్య అంత్యములు లేనివాడు దేవుడనీ, దేవుని మీద పూర్తి ఇష్టత విశ్వాసము కల్గి దేవునిలోకి ఐక్యమగుటయే ప్రార్థనలోని ముఖ్య ఉద్దేశ్యము.

కాని ప్రస్తుత కాలములో ఇందూ మతము హిందూ మతముగా మారిపోయి ఏకేశ్వరోపాసన స్థానములో బహుదేవతారాధన ఏర్పడినది. సూర్యాస్తమయముతో రాత్రి ప్రారంభమగుచున్నది. సూర్యాస్తమయము మానవుని అస్తమయమును తెలుపుచున్నది. జీవుని అంత్యము మోక్షమని, శరీర అంత్యము మరణమని తెలిసి ఆ రెండింటినీ తెలియజేయునది సూర్యుడు అస్తమించడము కావున సూర్యుడు అస్తమించు దిశకు తిరిగి నా అస్తమయము నీలోనికి ఐక్యము కావలెనని కోరికతో ప్రార్థన చేయడమునే **అంత్యప్రార్థన** అంటున్నాము. అంత్యప్రార్థన మోక్షము కొరకుండవలెను. సువిశాలమైన దేవునియందిమిడి కనిపించకపోవునట్లు ఉద్దేశ్యము కల్గి చేయడమే చివరి ప్రార్థన యొక్క అర్థము, ఉద్దేశ్యము. మానవుని గమ్యము చివరికి మోక్షమే కనుక మంగళవారమే చేయడము జరుగుచున్నది. **ఆది**

**సోమ, మంగళవారములలో ఆది, మధ్య, అంత్యకాలములైన ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రములలో బ్రహ్మ, కర్మ, భక్తియోగములు ఆచరించడమే త్రైతారాధనయని తెలియవలెను.**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| **ఆదివారము** | **--** | **ఉదయము** | **--** | **తూర్పు** | **--** | **బ్రహ్మయోగము** |
| **సోమవారము** | **--** | **మధ్యాహ్నము** | **--** | **దక్షిణము** | **--** | **కర్మయోగము** |
| **మంగళవారము** | **--** | **సాయంకాలము** | **--** | **పడమర** | **--** | **భక్తియోగము** |

మూడు యోగములతో, మూడు దినములందు, మూడుకాలములలో, మూడు దిశలలో దేవున్ని ఆరాధించడమే త్రైతారాధన. త్రైతారాధన ప్రబోధసేవా సమితివారే కాక అందరూ ఆచరించడము మంచిది.

త్రైతారాధకులు ముఖ్యముగా పరమాత్మ జ్ఞానము తప్ప అన్యదేవత ఆరాధన వదలి వేయవలసి ఉంటుంది. త్రైతారాధన మూడురోజులు, మొత్తము విశ్వమునే సృష్ఠించి నడిపించు స్వయంశక్తి పరుడైన పరమాత్మ ఆరాధనతో కూడుకొని ఉన్న దానివలన, అన్నింటికంటే పెద్ద, అసలైన సృష్ఠికర్త దేవుడని తెలిసిన తర్వాత ఇతర దేవుళ్ళను ఆశ్రయించడము పరమాత్మను మనము సరిగా అర్థము చేసుకోలేదని అర్థము. దేవుని గొప్పతనము తెలియనివారే ఇతర దేవుళ్ళను ఆశ్రయించగలరు. కనిపిస్తుంటే తొంగిచూడడము అవసరము లేదు కదా! అలాగే దేవుని జ్ఞానము తెలిసినపుడు ఇతర దేవతలను గూర్చి యోచించరు కదా! ఇతర దేవుళ్ళను మానవుడు సృష్ఠించుకొన్నదే కాని ఆ దేవుళ్ళు కూడా మనవలె జీవులేననీ, మనము పుట్టినట్లే వారుకూడా పుట్టారనీ చాలామందికి తెలియదు. పూర్వము పెద్దలు పరమాత్మను తెలుపు జ్ఞానమును తెలియజేయునిమిత్తము దృశ్యరూపమైన దేవాలయమును సృష్ఠించారు. దేవాలయ రూప నామములు పూర్వము దైవజ్ఞానముతో నిండుకొన్నవై ఉండెడివి. కాలక్రమమున ఆనాటి ఉద్దేశ్యమూ, జ్ఞానమూ తెలియకుండా

పోయిన దానివలన ఇతర ఉద్దేశ్యములతో మానవుడు అనేక దేవుళ్ళను తయారు చేసుకొన్నాడు. అర్థము లేని ఆచరణలలో మునిగి పోయాడు. ఇటువంటి ఆచారములను, భక్తిని, భగవద్గీతలో తామస ఆచారము, తామసభక్తి అని చెప్పబడి ఉన్నవి. ఖర్చు, కష్టము లేని పరమాత్మ ఆరాధనను వదలి ఖర్చు, కష్టమున్న అనేక ఇతర దేవతారాధనలను మనిషి కల్పించు కొన్నాడు. దేవుడు తప్ప ఇతర దేవతారాధన మాయప్రేరేపితమని తెలియని దానివలన వాటిలో ఇరుక్కొని పోయి పరమాత్మ జ్ఞానమునకు దూరమై పోవుచున్నారు. అన్యదేవతల ఆలయములు కట్టించినవారు మొదలుకొని ఆ దేవతలను పూజించువారు సహితము మాకంటే మించిన భక్తుడుగాని, మాకంటే మించిన జ్ఞానిగాని లేడని వారి మనస్సులో దృఢమైన గోడ కట్టుకొన్నారు. అటువంటి వారికి పరమాత్మ జ్ఞానము చెప్పినా వారి హద్దును దాటి వారు వినే స్థితిలో లేరు.

మోక్షాధిపతియైన పరమాత్మను తెలుపు నిమిత్తము పూర్వము ఇందూమతములోనే ఏకేశ్వరోపాసన తెలియజేయు జ్ఞానము వెలువడినది. ఇందూమతములోనే ఒకే దేవుని ఉపాసన తెలియజేయు దేవాలయములు కూడా తయారైనవి.

కాని ప్రస్తుత కాలములో ఇందూమతము హిందూమతముగా మారిపోయి ఏకేశ్వరోపాసన స్థానములో బహుదేవతారాధన ఏర్పడినది. కాలగమ్యములో ప్రత్యేకించి ఏ మతముకాని ఇందూమతము నుండి అనేక మతములు ఏర్పడినప్పటికీ, వాటిలో బహుదేవతారాధన లేకుండడము సంతోషదాయకమైనప్పటికీ, మతాల అవగాహన వారిలో లేకుండా పోయి పరమతద్వేషము కొందరిలో నిలిచిపోయినది. దీనిని బట్టి ఎవరు ఏ మతస్థులైనా వారిలో ఇంకా కొంత మాయ పని చేస్తున్నదనియే చెప్పవచ్చును. ఇటువంటి ప్రస్థుత కాలములో ఏ మాయ పనిచేయని విధానము, అన్ని

మతముల అవగాహన, అందరికీ మిగత దేవతలకు సహితము అధిపతియైన పరమాత్మను తెలియు జ్ఞానమున్న బోధలు గాని, అనుసరించు విధానములు గాని ఎంతో అవసరము. ఆ అవసరము తీర్చునట్లు **త్రైత సిద్ధాంత బోధలు దేవుడు మనకందించాడు**. దేవుడు అందించిన అసలైన జ్ఞానము ప్రబోధ సేవా సంస్థలో ఉండడము మన అదృష్ఠముగా భావించి ఈ సంస్థ సభ్యులు ఇతరులకు కనువిప్పు కల్గునట్లు కొన్ని ఆచరణలు కల్గియుండవలెను.

త్రైతారాధనను త్రైతసిద్ధాంతము తెలిసిన ప్రతి ఒక్కరూ ఆచరించ వలెను. ప్రబోధసేవా సమితి వారు త్రైతారాధన చేస్తూ తెలియని వారికి కూడా తెలియజెప్పు స్థోమత కల్గి ఉండవలెను. ఈ సంఘము వారు పరమాత్మ జ్ఞానము, పరమాత్మ ఆరాధనలో తప్ప ఇతర దేవతల ఆరాధనలో పాల్గొనరాదు. సమీప బంధువులు పిలిచినా, వారికి అర్థమగులాగ తమ విధానము తెలియజెప్పి మా పద్ధతి ప్రకారము అలా పాల్గొనడము దైవ ద్రోహమగునని చెప్పవలెను. పరమాత్మ కొరకు ఏమైనా కష్టపడవచ్చునుగాని ఇతర దేవతల కొరకు ఎటువంటి శ్రమగాని పడకూడదు. అన్యదేవతల కొరకు చేయు పూజలలో పాల్గొనక పోవడమేకాక అటువంటి పూజ నిర్వాహణకు గాని, నిర్మాణములకు గాని ఎటువంటి చందా ఇవ్వకూడదు. అట్లు ఇచ్చిన అజ్ఞాన సహితమైన పరదేవతారాధనను ప్రోత్సహించినట్లగును. ఆది, మధ్యాంత రహితుడు పరలోకాధిపతియైన పరమాత్మను గాని, ఆయన అంశనుగాని ఆరాధించు ఆరాధనలో పాల్గొనవచ్చును. అక్కడిచ్చు ప్రసాదమును మహా బహుమతిగా భావించవలెను. అన్యదేవతారాధనల ప్రసాదములను ఎవరైన ఇచ్చినా వాటిని తినుబండారములవలె భావించ వలెను. ప్రతి దినము తాను స్వయముగా కొంత త్రైత జ్ఞానమును తెలుసుకోవడము గాని, చేతనైతే ప్రతి దినము కొందరికైనా త్రైత జ్ఞానమును తెలుపడము గాని చేయవలెను. త్రైతారాధన చేయు మూడు దినములలోను

పవిత్రముగా ఉండుటకు అలవాటుపడవలెను. ఆ మూడు దినములలో కఠినముగ మాట్లాడుట, దూషించుట మానవలెను. త్రైతారాధనలో అందరూ తెల్లని వస్త్రములు ధరించవలెను. తెలుపు జ్ఞానచిహ్నామైన చంద్రుని రంగు. అందరు తెల్లని రంగు ధరించడము క్రమశిక్షణను తెలియజేయును. త్రైత సంఘములో ఎవరు చనిపోయినా పూర్వపు ఆచారమువలె ఆ శవమును శివముగ భావించి అందరూ శరీర అంత్యక్రియలో పాల్గొనవలెను. త్రైత జ్ఞానము ప్రకారము **"శ్రీమతము (శ్రీమంతము)"** జ్ఞానము కల్గిన స్త్రీలకు మాత్రమే చేయవలెను. చనిపోయిన వాడు జన్మలకు పోయినట్లయితే వానికి పిండాకూడు పెట్టకూడదు. చనిపోయిన వాడు మోక్షము చెందినట్లయితే వానికి తప్పనిసరిగా పిండాకూడు పెట్టు కార్యమును భావ పూరితముగా చేయవలెను. మృతదేహమునకు శివపూజ చేయునపుడు, అలాగే మోక్షము పొందిన వానికి పిండాకూడు పెట్టు సమయములోను త్రైతమును అనగా మూడు ఆత్మలను తెలుపు తెల్లనిగుడ్డను తలమీద ధరించవలెను. బహుశా పిండాకూడు కార్యము చాలా అరుదుగా జరుగును కావున ఈ పని లేకపోవచ్చును కానీ శివమును మాత్రము తలమీద గుడ్డ ధరించియే తాకవలెను. పిండాకూడును గురించి కాని, శవమును శివముగ చూచుటనుగాని, శ్రీమంతమును గురించిగాని ఇతరులకు తెలియ చెప్పడము మరియు త్రైత ఆరాధన గురించి చెప్పడము సాధ్యమున్నంత వరకు చేయవలెను. ప్రబోధ సేవాసమితి వారు నిత్యము జ్ఞానము తెలుసుకొనుటకు మరియు తెలియజెప్పుటకు కొంత కాలమును కేటాయించుకొన్నట్లు, దేవుని కొరకు ఒక గంటకాని లేక అరగంటకాని పని చేయునట్లు ఏర్పాటు చేసుకోవలెను. అలా చేయగా వచ్చిన డబ్బును దేవుని పనికి ఉపయోగించ వలెను. ప్రబోధసేవా సంస్థలో నిజమైన జ్ఞానమున్నదని ఇతరులకు తెలియునట్లు నడుచుకోవలెను.

భూమి మీద ధర్మములు అధర్మములుగా మారునని భగవద్గీతలో దేవుడు తెల్పినట్లు పూర్వము ఎంతో పవిత్రముగనున్న ఆది,సోమ,మంగళ వారములు ప్రస్థుత కాలములో అపవిత్రముగా మారిపోయినవి. అలాగే ఏ పవిత్రతలేని మిగతా నాలుగు దినములు పవిత్రముగా లెక్కించబడుచున్నవి. వివరముగా చూస్తే అన్ని విధములా చెడిపోయిన వానిని వీడు శనిపట్టిన వాడని అంటున్నాము. అన్ని విధములా చెడుపునకు శని అధిపతి అని అందరికి తెలిసినట్లే ఉన్నది. శనిదినమైన శనివారము పూర్వము పవిత్రత లేని దినముగనే లెక్కించెడివారు. అలాగే వస్తు,వాహన,విలాసములకు, శృంగారమునకు అధిపతియైన శుక్రుని యొక్క శుక్రవారమును, ప్రపంచ దేవతలకు గురువుగయుంటూ ప్రపంచ జ్ఞానమునకు అధిపతిగయుండి ప్రపంచజ్ఞానము మీద మనుషులను లగ్నము చేయు గురుగ్రహము యొక్క దినమైన గురువారమును, మంత్ర తంత్రములకు, భూతప్రేత పిశాచములకు తాంత్రిక విద్యలకు అధిపతియైన బుధుని యొక్క దినమైన బుధవారమును పరమాత్మ జ్ఞానము తెలిసినవారు ఏమాత్రము పవిత్రదినముగ భావించెడివారు కారు. జ్ఞానరీత్యా మొదటి మూడు దినములైన ఆది, సోమ, మంగళ వారములనే పవిత్రముగ చూచుకొనెడివారు. ప్రస్తుత కాలములో చివరి మూడు దినములైన గురు,శుక్ర,శనివారములు పవిత్రముగా మారిపోవడము, మొదటి మూడు దినములైన ఆది,సోమ,మంగళవారములు అపవిత్రముగా మారిపోవడము జరిగినది.

అన్ని విధములా భ్రష్టుపట్టినవానికి మారుపేరుగా చెప్పు శని వారమును, అన్ని దరిద్రములకు గుర్తుగా చెప్పు శనివారమును ఏమాత్రము జ్ఞానములేని వారు కూడా పవిత్రముగా పరిగణిస్తున్నారు. చాలామంది శనివారము ఇల్లు వాకిలి శుభ్రముచేసుకొని, కొందరు దేవతలకు ప్రత్యేకముగ పూజలు చేయుచున్నారు. శనివారము శుచి శుభ్రమును పాటిస్తు తలస్నానము చేసి మాంసముగాని, చేపలనుగాని ఇంటి లోపలికి కూడ

తీసుకురాక పవిత్రదినముగా భావించుచున్నారు. జ్ఞానసంబంధముగా ఎటువంటి ప్రత్యేకతలేని దినమును మరియు దరిద్రములకు మారుపేరైన శనివార దినమును ఈ కాలములో పవిత్రముగా చూడడము, అన్ని విధముల జ్ఞానవివరముతో కూడుకొన్న ఆదివారమును అపవిత్ర పనులకు వాడుకోవడము చూస్తే ధర్మము అధర్మముగా మారినదని చెప్పకుండా ఉండలేము. అలాగే ఏమాత్రము జ్ఞానసంబంధ విషయములులేనిది, ప్రపంచ సంబంధమైన ధన, కనక, వస్తు, వాహన, భోగభాగ్య, శృంగార విషయములకు ఆలవాలమైన శుక్రగ్రహ దినమైన శుక్రవారము కూడా లక్ష్మీవారమని, డబ్బుదినమని, డబ్బుకొరకు పూజలు నిర్వహిస్తు, ఉపవాసాలు ఉంటూ పవిత్రముగా గడపడము చూస్తూనే ఉన్నాము. గురువారము కూడా సాయిబాబా భక్తులు, రాఘవేంద్రస్వామి భక్తులు శుచి శుభ్రతలతో పవిత్రముగా పూజలు సాగించడము కూడా చూస్తున్నాము. ఈ విధముగా వారమునకు చివరివైన గురు,శుక్ర,శని మూడురోజులను పవిత్రముగా చూడడము, మొదటి ఆది,సోమ,మంగళ మూడురోజులను అపవిత్ర కార్యములకు వాడుకొంటూ వాటికి ప్రాధాన్యత ఇవ్వకపోవడము చాలా గమనించదగ్గవిషయము. దీనినిబట్టి కాలగర్భములో ఎన్నో ధర్మములు అధర్మములుగా, అధర్మములు ధర్మములుగా తిరగబడినవని అర్థమగుచున్నది. పరమాత్మ జ్ఞానమునకు అవరోధములైన అధర్మములను లేకుండా చేసుకొని, దేవుని ధర్మములను ప్రచారము చేసి వాటిని ఆచరించడము మన కర్తవ్యము. అధర్మములను లేకుండా చేసి ధర్మములను నెలకొల్పుటకు సృష్ఠికర్తయైన దేవుడే మానవునిగ వచ్చి ఎన్నో శ్రమలు, బాధలు, అవమానములు చవిచూచాడు. మానవులమైన మనము ఇపుడు ధర్మములను ధర్మములుగా, అధర్మములను అధర్మములుగా చూపించి చెప్పితే అధర్మములకు అలవాటుపడిన మనుషుల ద్వారా కొంత ఇబ్బంది తప్పదు. విషయములోని సత్యము తెలిసి చెప్పక పోతే తన లోపలి దైవ ప్రతినిధియైన ఆత్మకు ద్రోహము

చేసినట్లగును. తెలిసి చెప్పితే ఇటు అజ్ఞాన ప్రజలకు అయిష్టత ఏర్పడును. చెప్పకపోతే అటు ఆత్మ ద్రోహమగును. ఆదివారము ఇల్లు, ఒళ్ళు శుభ్రముగా ఉంచుకొని మాంసము తెచ్చుకోకుండా పవిత్రముగ గడపమనినా, శనివారము మాంసము తినవచ్చుననినా జ్ఞానము తెలియనివారికి చాలా విరుద్ధముగా ఉండును. దైవమార్గములో ఎటువంటి కష్టములనైనా ఎదుర్కొనవలెనని, దానివలన దైవమునకు చేరువకాగలమని తలచి ప్రతి మనిషి ధర్మములనే ప్రచారము చేసి అధర్మములను లేకుండా చేయుటకు ప్రయత్నించవలెను.

పూర్వము ఇందూమతము ఎంతో జ్ఞానోన్నత కల్గియుండెడిది. జ్ఞాన సంపన్నదేశమైనందు వలన భారతదేశమును ఇందూదేశమని కూడా పిలిచెడివారు. పూర్వము మూడు దినములు త్రైతారాధన సక్రమముగా జరిగెడిది. ఆనాడు సామూహిక త్రైతారాధన నేడు ఇస్లాం మతములో మస్జిద్‌నందు జరుగు ప్రార్థనలాగుండెడిది. ప్రతి ఒక్కరూ ప్రార్థనలో పాల్గొనెడివారు. అటువంటి ఇందువుల ఆరాధన నేడు మచ్చుకైనా కానరాకుండా పోయినది. పూర్వము ఎంతో అర్థసహితముగా చేయు జ్ఞాన ఆరాధన లేకుండాపోయినది. అదేరీతిని పోలిన ప్రార్థనలు ఇస్లాం స్థాపనలో ముస్లిములందున్నాయి. ఎంతో విశ్వాసము, దేవునిపట్ల విధేయత, ప్రవక్తల మాట జవదాటని క్రమశిక్షణ ఇస్లాంమతములో ఉండడము సంతోషింపదగిన విషయమేయైనా పూర్వకాలమే ఎంతో జ్ఞానోన్నతమైన ఇందూమతములో నేడు అజ్ఞానము చోటుచేసుకొని అనేక అన్యదేవతల ఆరాధనలకు అలవాటుపడి తమదైన త్రైతారాధనను మరచిపోవడము విచారింపదగిన విషయము. ఇప్పటికైనా తమ పొరపాటును గ్రహించి వెనుక పుట్టిన ఇస్లాం మతములోని వారి ఆరాధన (నమాజ్)ను చూచి, చాలాముందు పుట్టిన మనకు ఎంతో జ్ఞానవివరముతోనున్న ఆరాధన కలదని గ్రహించి,

త్రైతారాధన వివరము మనము తెలుసుకొని ఇతరులకు తెలిపి, ఆచరించి ఇతరులను ఆచరింప చేయవలెను. ఇందువైన ప్రతి ఒక్కరు ఇంతవరకూ తెలియని త్రైతారాధనను తెలియాలి. ఇంతవరకు ఇతర గురువులు, ఇందూమతములోని జ్ఞానమును బోధించు స్వాములు ఎవరూ ఈ విషయము చెప్పలేదే! అని మమ్ములను ప్రశ్నించక, ఎందరు స్వాములుండినా, జ్ఞానము తెలియక పోతే ప్రయోజనము లేదని తలచి ఇతర మతముల ముందర ధైర్యముగా నిలబెట్టగలుగు త్రైతారాధన చేయండి. మగతనము లేని పురుషుడు భార్యను ఎంత బాగా చూచుకొనినా, ఆడతనము గల స్త్రీకి అసంతృప్తే ఉంటుందట. అలాగే పురుషత్వమును (దైవమును) తెలుపలేని గురువు ఎంత బాగా బోధించినా ఆడతనము (మాయతత్వము) గల వానికి అసంతృప్తియే మిగిలి ఉంటుంది. అందువలననే నేటి కాలములో ఒకవ్యక్తి ఎందరో గురువులను ఆశ్రయించడము జరుగుచున్నది. అప్పటికి కూడా వానికి తెలియవలసినది తెలియడము లేదు. ఇప్పటికైనా మించిపోయినది లేదు. గురువుల భ్రమలు వదలి అందరికీ **"జగత్ గురువు"** అనువాడు ఒకడు కలడని తలచి, వానిని అన్వేషించు ఉద్దేశ్యముతో ఈ త్రైతారాధన ఆచరిస్తూ ఇందువుల ఆరాధన ఇట్లుండునని తెలియునట్లు చేయవలెను. **నీవు నిజమైన ఇందువైతే నీముఖాన బొట్లు, నామముకంటే ముఖ్యము ఆది, సోమ, మంగళవారముల ఆరాధన, మూడు దినములు, మూడు దిక్కులలో, మూడు యోగములతో, మూడు లోకముల వారికి తెలియునట్లు మూడు ఆరాధనలు చేసి 'ఇందువు' అను పదమునకు విలువను, అర్థమును చేకూర్చవలెనని కోరుచున్నాము. ఇప్పటికైనా ప్రతి దినము ఇందువుగా పుట్టి, ఇందువుగా బ్రతికి, ఇందువుగా మరణించమని తెలియజేయుచున్నాము.**

*****

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము గాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము గాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి, బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక,

అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :–** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :–** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :–** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :–** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :–** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును

కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టి పుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది

నుండి 'సృష్ఠికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము.

'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించు చుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**

*(అనంతపురం, సాక్షి న్యూస్‌పేపర్, 12-10-2015)*

# 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తెల్పింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు.

ప్రముఖుల లేఖ

*(సాక్షి న్యూస్‌పేపర్, 21-01-2014)*



# ఇందు దేశమే ఇండియా!

**హి**మాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,
ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే
దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.

**భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు ఒకే దైవగ్రంథములోని భాగములే.

మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే "ప్రబోధ సేవాసమితి" లో

సభ్యులుగా చేరండి. దేవుడు మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...

--- శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

**ఫోన్ : 09948947630, 09491040963, 09440556968**

